JAGATI Rs. 2-00 January 1992

37th Year of Publication




**426**

జనవరి - **1992**

## సాహితీ సుధ

యతి సంగంబున బాలు డాదరముచే క్ష్మాభర్త దుర్మంత్రిచే
శ్రుతి హానిన్ ద్విజు డన్వయంబు ఖలుచే గ్రూరార్తిచే శీలము
ద్ధతిచే మిత్రత చూపులేమి గృషి మద్యప్రాప్తిచే సిగ్గు దు
ర్మతిచే సంపదలున్ నశించు జెడు సర్వంబుల్ ప్రమాదంబునన్

—భర్తృహరి

తీర్థసంవాసు లేతెంచి రని విన్న - నెదురుగా నేగు దవ్వెంతయైన
నేగి తత్పదముల కెరగి యింటికి దెచ్చు - దెచ్చి సద్భక్తి నాతిథ్య మిచ్చు
నిచ్చి యిష్టాన్న సంతృప్తులగా జేయు - జేసి కూర్చున్నచో జేరవచ్చు
వచ్చి యిద్ధర గల్గు వనధి పర్వత సరి - త్తీర్థ మహాత్మ్యముల్ దెలియ నడుగు
నడిగి యోజన పరిమాణ మరయు నరసి - పోవలయు జూడ ననుచు నూర్పులు నిగుడ్చు
ననుదినము తీర్థ సందర్శనాభిలాష - మాత్మ నుప్పొంగ నత్తరు ణాగ్నిహోత్రి

—అల్లసాని 'పెద్దన మనుచరిత్ర'

**'జ గ తి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004**
**ఫోన్ : 76697 - చందా 2 సం॥లకు రు. 50-00 - 4 సం॥లకు రు. 100-00 - జీవిత చందా రు. 300-00. పాట్రన్ - రు. 1000-00. విదేశాలలో పాట్రన్ రు. 2000-00**

ముఖచిత్రం : శరద్ పవార్

# నిమ్మతొనలు

ఏం చేస్తున్నావోయ్ గుర్నాధం ? చిన్నప్పుడు చాలా బ్రిలియంట్‌గా ఉండేవాడివి' - అని అడిగారు వెంక ట్రావు మేస్టారు ఒకనాటి విద్యార్ధిని.

'చిన్నప్పటి తెలివి తేటలు పెద్ద య్యాక రాణించవండి' - అన్నాడు గుర్నాధం.

'అయితే నేను నేర్పిన చదువంతా బూడిదపాలు చేశావన్నమాట ?'

'బూడిద పాలు చేయలేదండి - గంగ పాలు చేశాను'

'అంటే ?'

'ఇరిగేషన్ యింజనీరు నయాను, సార్, మీ చలవవల్ల'

—సి నాగేశ్వరావు
సికిందరాబాదు

మిత్రులు రమాపతి, అప్పారావు బజార్లో కలుసుకు, ఒక పక్కగా తప్పుకు, కబుర్లు చెప్పుకుంటున్నారు.

'ఏమండీ అప్పారావుగారూ ఈ మధ్య మీ అబ్బాయికి పెళ్లి నిశ్చయ మయిందట ?'

'నిశ్చయ మయిందండీ - కట్న కానుకలు కూడా మేము అడిగినంత యివ్వడానికి వొప్పుకున్నారు. తీరా, తాంబూలాల దగ్గిరకొచ్చేసరికి బెడిసి కొట్టి, సంబంధం తప్పి పోయింది'

'మీ వాడు బుద్ధిమంతుడు - కుర్రాడు బావుంటాడు. బాగా ఆస్తి పాస్తులు వున్నాయి. ఎందుకలా జరిగింది ?' - అని రమాపతి ప్రశ్న.

'పెద్దగా కారణమేమీ లేదండీ — మాకు కిర్సనాయిల్ డిపో వుంది కదా, అందుకని ససేరియా పిల్ల నిచ్చేది లేదన్నారు.

—పియమ్ సుందరరావు
విజయవాడ-8

డాక్టరుగారూ, ఆ రామ్మూర్తికి ఆపరేషన్ అవసరమంటారా ? - అని అడిగింది నర్సు మాధవి.

'మాధవీ, నీవు అనవసరమైన విష యాలు కల్పించుకోకు, నీ పని రోగు లకి సేవ చేయడమూ, నా పని మందు లివ్వడమూ, ఆపరేషనులు చేయ డమూ....' - అన్నాడు డాక్టరు.

'సారీ సార్ - తెలుసుకుందామని అడిగాను.'

'అయితే, చెబుతాను విను. అతనికి ఆపరేషన్ అవసరమైనా కాకపోయినా, ఈ నర్సింగ్ హోమ్ నడిపేందుకు మనకు డబ్బు అవసరం.'

—ఎమ్ సోమశేఖర్
అమలాపురం

శ్యామల కూరలు కొనుక్కునేం దుకు మార్కెట్‌కి వచ్చింది. తను వాడుకగా తీసుకొనే కొట్టు ముందు పధ్నాలుగేళ్ల పిల్ల ఏడుస్తూ, కాస్త ఎడంగా వున్న ముగ్గురు పోకిరీ పిల్లలతో 'నా డబ్బు నా కిచ్చేయండి' అంటోంది. తీరా చూస్తే ఆ అమ్మాయి తన ఫ్రెండు కృష్ణవేణి యింట్లో పనిపిల్ల.

'ఏం జరిగిందమ్మా ?' అని అడిగింది శ్యామల.

'ఈ అబ్బాయిలు నా చేతిలోని పదిరూపాయల నోటు లాకున్నారు' అని దీనంగా చెప్పుకుంది.

శ్యామల ఆ అబ్బాయిలని పిలిచింది - వారు వచ్చారు. 'ఈ పిల్ల డబ్బు ఎక్కడ పారేసుకుందో మాకు తెలియదు. మమ్మల్ని అనవసరంగా అల్లరి పెట్టేందుకు అబద్ధం చెబుతోంది' - అన్నారు.

'సరి, నిజా నిజాలు భగవంతుడికి తెలియాలి. నేనింటికెళ్లగానే మంత్రం పెడతాను. అబద్ధం చెప్పినవారికి తెల్లారేసరికి 104 జ్వరం వచ్చి, పది రోజుల దాకా తగ్గదు — అప్పుడు కూడా నిజం ఒప్పుకుంటేనే' — అని చెప్పి, ఆ పని పిల్లకి కూరలు కొనిచ్చి, యింటికెళ్లిపోయింది శ్యామల.

రెండు రోజుల తర్వాత మార్కెట్‌కి వచ్చినప్పుడు వాడుక కొట్టతను 'అమ్మా, మొన్న మీరు వెళ్లిన పావు గంటకి ఆ ముగ్గురిలో ఒకబ్బాయి వచ్చి ఈ పది రూపాయిల నోటు యిచ్చి వెళ్లాడు' అన్నాడు.

—బులుసు శారద
కలకత్తా-53

నా వయసు తొంభై అని జాతకంలో ఉంది' అని ఘనంగా చెప్పుకున్నాడు శంకరం, జగన్నాధంతో.

'ఇప్పుడు నీ వయసెంత ?'

'నలభై'

'నీకు డ్రింకూ, అమ్మాయిలూ, రేసులూ, కార్డ్స్ యిలాంటి వేమైనా ఉన్నాయా ?'

'అలాటి వేమీలేవు'.

'ఎందుకయ్యా మరొక ఏభై ఏళ్లు దండగ వేయటం ?'

—వి కామేష్
విశాఖ-3

# పాఠకుల తీర్పు

శ్రీ చందూర్ గారికి : నమస్కార ములు. మీరు ప్రచురిస్తున్న 'జగతి' చాలా బాగుంది. అన్ని శీర్షికలూ ఆసక్తి దాయకంగా ఉంటున్నాయి. అట్ట తిప్పగానే కనిపించే 'సాహితీ సుధ' సౌరభాలను వెదజల్లుతూ ఉంటుంది. ఇంత మంచి పత్రికను పాఠకలోకం ఆదరించాలని అభిల షిస్తూ, జీవిత చందా నిమిత్తమై రు 300/- బాంక్ కలెక్షన్ ఛార్జీలకు రు. 10/- మొత్తం రు. 310/- చెక్కు యిందుతో పంపుతున్నాను - స్వీకరించ గలరు.

—దూర్వాసుల దక్షిణామూర్తి
విశాఖపట్నం-1

చందూర్ దంపతులకు : నమ స్కారములు. మీకు ఉత్తరం రాయా లని చాలా రోజులుగా ప్రయత్నం. కాని, యిప్పటికి కుదిరింది. ప్రతినెలా 'జగతి' చదువుతుంటే, మీ యిరువురి తో ముచ్చటిస్తున్నట్లే ఉంటుంది. మద్రాసులో జరుగుతున్న కార్యక్రమా లన్నింటికి మేమూ హాజరవుతున్నట్లు గానే అనుభూతి కలుగుతుంది.... నేనూ మా వారూ జూలై నెలలో అమెరికాలో ఒక నెల పర్యటించి వచ్చాము. అప్పుడు అక్కడ శ్రీమతి కె రామలక్ష్మి గారిని శ్రీ ఆరుద్ర గారిని కలుసుకొని వచ్చాము.... మీ బొంబాయి ప్రయాణం ఎప్పుడు ?.. అభినందనలతో.

—తురగా జయశ్యామల
బొంబయి-14

ప్రియ మిత్రులు శ్రీ చందూర్ గారికి : సహృదయులు కనుకను పండిత పక్షపాతి కనుకను డాక్టర గోపాలరెడ్డి గారు పుదూరు వారిని గురించి అంత చక్కగా చెప్పారు బెజవాడ వారిది సత్యవాక్కు ... తెలుగు వారి పెద్ద మనసు వల్ల నా తిరుక్కురళ్ తెలుగు సేత బాగా ప్రచారంలోకి వచ్చింది. ప్రతులన్నీ అమ్ముడు పోయాయి. రెండవ ముద్రణకు ప్రకాశకులు ఎవరైనా ముందుకు వస్తారనే నా నమ్మకం.

—చల్లా రాధాకృష్ణశర్మ
మధుర-20

'జగతి' సంపాదకులకు మనః పూర్వక నమస్కారములు .... శ్రీ తల్లాప్రగడ ప్రకాశరాయుడు గారు ఆంధ్రులకు చిరస్మరణీయుడు. గాంధీజీ అడుగుజాడల్లో నడిచిన మా పెద న్నయ్య దీక్షితులు ప్రకాశరాయుడు గారు సన్నిహితులు. గోదావరి కపతల గట్టున బాగల్లు ఆశ్రమము.... అనాటి చరిత్ర తెలుగు జాతి పవిత్ర స్మృతి.

— పియల్ నరసింహామూర్తి
మద్రాసు-94

# వెన్నెల కెరటాలు

## జ్ఞాన్‌పీఠ్

వినాయక్ కృష్ణ గోకాక్ కన్నడ భాషలో ఈ అవార్డు అందుకున్న వారిలో అయిదవ వారు. కె.వి. పుత్తప్పా, డి.ఆర్. బెంద్రీ, శివరామ్, వెంకటేశ్ అయ్యంగార్లు లోగడ అందుకున్నారు.... దక్కన్ సొసైటీ వారి ఆర్థిక సహాయంతో 1936 లో 'ఆక్స్ ఫర్డ్' వెళ్లారు. ఓడపై ప్రయాణం గోకాక్‌ను ఎంతో ప్రభావితం చేసింది .... ఈయన వ్రాసిన మహాకావ్యం 'భారత్ సింధు రశ్మి'లో విశ్వామిత్రుడు అతని పుత్రుడైన విశ్వరథుని కథతో పాటు భారతదేశ సంస్కృతికి సంబంధించి ఎంతో ఉంది. ఈ దేశానికి సంబంధించిన పురాతన చరిత్ర కూడా ముక్కముక్కలుగా ఉందంటారు. దేశంలో ప్రబలిపోతున్న హింసావాదం ప్రాంతీయ తత్వం, ఇతర దౌర్జన్య సంఘటనలు ఆయనను కలచి వేస్తున్నాయి.... ఏడెనిమిది దశాబ్దాలుగా కన్నడ సాహిత్యం ఎంతో అభివృద్ధి చెందింది. ఆ అభివృద్ధిలో గోకాక్ ఒక భాగస్వామి.

—ప్రియదర్శిని
'సర్కార్ ఎక్స్‌ప్రెస్' లో

## ఒకనాటి మాట

శ్రీ సంజీవరెడ్డి, శ్రీ సంజీవయ్య, శ్రీ బ్రహ్మానందరెడ్డి తరువాత, శ్రీ పి.వి. నరసింహారావు గారు ముఖ్యమంత్రిగా పరిపాలన చేస్తుండగ ప్రత్యేక వాద శక్తులు ప్రబలి, ప్రత్యేక తెలంగాణా, ప్రత్యేక ఆంధ్ర ఉద్యమములను నడిపారు, శ్రీ పి.వి., శ్రీమతి ఇందిరాగాంధీ నాయకత్వాన ఉద్యమాలను ఎదుర్కొని ఆంధ్రప్రదేశ్ సమైక్యతా వీరుడుగా నిలబడినారు. ప్రత్యేకవాదులు జరిపిన దాడులకు, ఎన్నో అవమానాలకు భరించి శ్రీ పి.వి. తో సమైక్యతకు నిలబడే అవకాశము నాకు కలిగింది. నాతో పాటు శ్రీ భాట్టం శ్రీరామమూర్తి, శ్రీ లుకలాపు లక్ష్మణదాసు సమైక్యతా వీరులుగా నిలబడినారు. మేము ముగ్గురం మాత్రమే మంత్రులలో సమైక్యతకు శ్రీ పి.వి. వెంట నిలబడినాము....డిశంబరు 25 వ తేదీ విజయవాడలో సమైక్యతా వాదులు సమావేశము కాని, గన్నవరంలో విమానం దిగకుండా తారు పీపాలు దొర్లించి నిప్పు పెట్టారు.

—యమ్వి కృష్ణారావు
'గాంధీ క్షేత్రం'లో

# పాతికేళ్ల నాటి పిక్చర్



## ఎవియమ్ వారి
## 'భక్త ప్రహ్లాద'

మొట్టమొదటి తెలుగు టాకీ 'భక్త ప్రహ్లాద' - ఇప్పుడు మళ్లీ ముప్ఫయ్యాయిదేళ్ల తర్వాత, ఈస్ట్‌మాన్ కలర్‌లో, సాంకేతిక ప్రగతితో, అదే పౌరాణికగాథ. పౌరాణికాలు అనగానే నిర్మాతలకు తాము చూపబోయే కథ విషయమై స్థిరమైన అభిప్రాయాలు వుంటాయి. అలాగే ప్రేక్షకుల మనసుల్లో కూడా ఆయా పాత్రలు విస్పష్టంగా ముద్రితమై వుంటాయి ... వైకుంఠ లోకానికి ద్వారపాలకులైన జయ విజయులు, సనక సనందనాదులని అపహాస్యం చేసి శాపం పొందుతారు. మూడు జన్మల శత్రుత్వంలోని మొదటి జన్మ హిరణ్యా. కశిప హిరణ్యాక్షులు. వీరు అరిషడ్వర్గాలకు లోనై, అజ్ఞాన తిమిరంలో కొట్టుమిట్టాడుతున్నారనీ, చివరికి శ్రీహరే వీరిని సంహరించి దుష్టశిక్షణ, శిష్ట రక్షణ చేయవలసి వుంటుందనీ చూసేవారికి ముందే తెలుసు. అయితే, ఆ కథా క్రమంలోని నాటకీయత, సార్వజనీనత, సంస్కృతీ ఝురి నిత్య నూతన లక్షణాలు గలవి. ఎవరి శైలీ, శిల్పమూ బట్టి వారు పునఃసృష్టి గావించి ప్రేక్షకుల మెప్పు పొందవచ్చు.... అంజలీదేవి తను ధరించే పాత్రకు న్యాయమూ నిండుతనమూ చేకూర్చగల నటీమణి. లీలావతిగా అంజలీదేవిని చూస్తున్నప్పుడు, లీలావతి అక్షరాలా అలాగే వుండి వుంటుందనిపిస్తుంది. రెండు నెలల క్రితం భస్మాసురునిగా హడలెత్తించిన యస్వి రంగారావు ఇప్పుడు హిరణ్యకశిపునిగా ప్రత్యక్షమవుతాడు. 'చదువులలో సారమెల్ల చదివితి తండ్రీ' అని ప్రహ్లాదుడు అంటున్నప్పుడు, కొడుకు మనసు మార్చలేని అసహాయ వేదన, దాని వెంట వాత్సల్యమూ, కాలపాశమే తన ముందు తనయుని రూపాన తాండవిస్తోందేమోనన్న భయభ్రాంతి - ఎంతో సమర్థవంతంగా కనబరిచాడు యస్వి రంగారావు. నారద పాత్రధారి బాలమురళీకృష్ణ కంఠ మాధుర్యమే గాక నటనకూడా చక్కగా రాణించింది. ఢివి నరసరాజు సంభాషణలు పాత్రోచితంగా గంభీరంగా ఉన్నాయి. ముగ్ధమోహనంగా ఉంది రోజా రమణి భక్త ప్రహ్లాద పాత్రలో. భాగవతంలోని రసగుళికలకు (పద్యాలు) రాజేశ్వరరావు గాత్ర వైభవం.... ఈ చక్కటి చిత్రానికి దర్శకులు చిత్రపు నారాయణ మూర్తి.

—యన్నార్ చందూర్ సమీక్ష
'జగతి' - జనవరి, 1967






## స్పేస్ మిర్రర్

అంతరిక్ష పరిశోధనలో అసువులు బాసిన వ్యోమగాముల స్మృతి చిహ్నంగా అమెరికాలో నిర్మించిన 'స్పేస్ మిర్రర్' అనే కట్టడం కోసం దక్షిణ భారతదేశం నుంచి తీసుకు వెళ్లిన 'గ్రానైట్'ని వినియోగించారు. కాలిఫోర్నియాలో అమెరికా వ్యోమ, వైమానిక సంస్థ (నాసా) ఆధ్వర్యంలో గల కెనడీ అంతరిక్ష కేంద్రంలో నిర్మితమైన ఈ 'వ్యోమ వీరుల స్మారక చిహ్నం' 43 అడుగుల ఎత్తు, 50 అడుగుల వెడల్పు వుంది. దీని నిర్మాణానికి 62 లక్షల డాలర్ల వ్యయం అయింది. ప్రపంచంలోకెల్లా అత్యుత్తమమైన గ్రానైట్స్‌లో ఒకటిగా పేరు పొందిన భారతీయ గ్రానైట్‌ని అమెరికాలోని ఎం.ఎస్. ఇంటర్నేష నల్ అనే భారతీయ సంస్థ 'నాసా'కు సరఫరా చేసింది. కాగా, 'స్పేస్ మిర్రర్' స్మారక చిహ్నం మీద మృతవీరులైన 14 మంది అమెరికన్ వ్యోమగాముల పేర్లను 'వాటర్ జెట్ టెక్నాలజీ' సహాయంతో చెక్కారు. ఈ భారీ, నలుపురంగు గ్రానైట్ కట్టడం సూర్యుడి కదలికలను అను సరించి కదులుతుండడం ఒక విశేషం. ఈ 'స్పేస్ మిర్రర్' పరిభ్రమణం ఒక కంప్యూటర్ ద్వారా జరుగుతుంది.

.... (అమెరికా సమాచార శాఖ

## గోదావరి

గోదావరి నాసికాత్రయంబకంలో పుట్టింది. పడమటి కనుమల్లో బొంబాయికి ఈశాన్య దిశగా సుమారు 112 కి.మీ.ల దూరంలో ఒక కొండలో గోదావరి పుట్టింది. ఈ నది పరీవాహ ప్రదేశం సుమారు ఒక లక్ష 20 వేల చదరపు మైళ్లు. నది పొడవు సుమారు 900 మైళ్లు. మంజీర, ప్రాణ హిత, ఇంద్రావతి, శబరి, గోదావరికి ఉపనదులుగా వున్నాయి. ధవళేశ్వరం వద్ద 1852లో సర్ ఆర్థర్ కాటన్ కట్టిన ఆనకట్ట వల్ల ఉభయగోదావరి జిల్లాల్లో లక్షలాది ఎకరాలు సస్య శ్యామలమై, ఆంధ్రప్రదేశ్ అన్నపూర్ణ అయింది. తుల్యభాగ, ఆత్రేయ, భర ద్వాజ, గౌతమి, వృద్ధ గౌతమి, కౌశికి, వశిష్ఠ అనే ఏడు పాయలుగా చీలి

గోదావరి సముద్రంలో కలుస్తోంది. అందుకేదీన్ని సప్తగోదావరి అంటారు. తుల్యభాగ ధవళేశ్వరం నుండి చొల్లంగి పోయి, ఆత్రేయ కపిలేశ్వర పురం నుండి కోటిపల్లి మీదుగా కోరంగి పోయి, భరద్వాజ కపిలేశ్వర పురం నుండి కోటిపల్లి మీదుగా తీర్థాల మొండి చేరుకొని, గౌతమి త్రయంబక గిరి నుండి తీర్థాలమొండి చేరుకొని, వృద్ధగౌతమి ముక్తేశ్వరం నుండి తీర్థాలమొండి చేరుకొని, కౌశికి మంద పల్లి నుండి బెండమూర్లంక చేరుకొని, వశిష్ట విజ్జేశ్వరం నుండి అంతర్వేది వరకు ప్రవహించి, సముద్రంలో కలుస్తున్నాయి. జమదగ్ని, అత్రి, భరద్వాజుడు, గౌతముడు, వాయు దేవుడు, విశ్వామిత్రుడు, వశిష్ఠుడు – ఏడుగురు మహర్షులు ఏడు పాయలను సముద్ర సంగమం చేయించినట్లు పురాణ గాథ వుంది, గోదావరి తీరం లో రాజమహేంద్రవరం (రాజ మండ్రి), మన రాష్ట్రంలో సాంస్కృ తిక కేంద్రంగా పేరుపొందింది. ఈ పట్టణానికి పంచమ దుర్గమనే పేరుండేది. హేమగిరి (వేమగిరి), ధవళగిరి (ధవళేశ్వరం), రామగిరి (రాయదుర్గం), భద్రగిరి (పట్టిసం), పద్మగిరి (రాజమహేంద్రవరం). గోదావరి తీరంలో రాజమహేంద్ర వరం తెలుగువారి సాహితీ, సాంస్కృ తిక రాజధానిగా విలసిల్లుతూ వచ్చింది. ఆదికవి నన్నయ భట్టారకుడు ఆంధ్ర మహా భారతానికి శ్రీకారం చుట్టిన నాటి నుంచి ఈ గడ్డమీద తెలుగు సాహిత్యం ఎన్నో మలుపులు తిరిగింది. కవులు, నాటక కర్తలు, కళాకారులు అసంఖ్యాకంగా తెలుగు సంస్కృతీ సౌరభాలను ప్రపంచానికి వెదజల్లారు.

(పిఐబి

## 'గామా' కిరణాలు

అమెరికన్ రోదసీ విమానం అట్లాంటిస్ ఇటీవల అంతరిక్షంలోకి తీసుకు వెళ్లిన 15 మెట్రిక్ టన్నుల బరువైన 'గామా కిరణ వేధశాల' 'నాసా' ప్రయోగించిన శాస్త్ర విజ్ఞాన సంబంధిత ఉపగ్రహాలన్నిటిలోకి అతి పెద్దది. భూమికి 450 కిలోమీటర్ల ఎత్తున కక్ష్యలో తిరుగుతూ రెండు నుంచి ఆరేళ్లపాటు 'గామా' కిరణాల పై పరిశోధనలు జరిపేందుకు ఈ వేధశాలను ఉద్దేశించారు. దర్శనీయ కాంతిలోని 'ఎనర్జీ'కి 3 వేల కోట్లరెట్లు అధికమైన 'ఎనర్జీ'ని కలిగివుండే అతి శక్తివంతమైన రేడియేషన్‌ని 'గామా' కిరణాలంటారు. కాగా 'థర్మో న్యూక్లి యర్' ప్రేళ్లు, బ్లాక్‌హోల్స్, ఇంకా వెయ్యి సంవత్సరాల వ్యవధిలో సూర్యుడు వెలువరించే వేడిమికంటె అధిక వేడిమిని ప్రసరించే అంతు తెలియని ఆకస్మిక కాంతి ప్రసారాల తో అద్భుతంగా, అతి భయానకంగా కనిపించే అనంత విశ్వాన్ని ఖగోళ శాస్త్రవేత్తలు మరింత సమర్థంగా పరిశీలించేందుకు 'అట్లాంటిస్' ద్వారా

అంతరిక్ష ప్రవేశం చేసిన 'గామా' కిరణ వేధశాల తోడ్పడుతుందని భావిస్తున్నారు. 'నాసా' ప్రయోగించ దలచిన నాలుగు మహా వేధశాలలలో ఈ 'గామా రే అబ్జర్వేటరీ' రెండవది. ప్రస్తుతం కక్ష్యలో తిరుగుతున్న హబుల్ స్పేస్ టెలిస్కోప్ వీటిలో మొదటిది. ఒక 'ఎక్సరే' మరొక 'ఇన్‌ఫ్రారెడ్' ఉపగ్రహాలను కూడా కక్ష్యలోకి ప్రయోగించాలని అను కుంటున్నారు. ప్రస్తుతం అట్లాంటిస్ ద్వారా అంతరిక్ష ప్రవేశం చేసిన 'గామా' కిరణ వేధశాలలో చిన్న మోటారు శకటం పరిమాణంలోని నాలుగు భారీ డిటెక్టర్లు ఉన్నాయి. వీటిలో ఒక డిటెక్టర్‌ని పశ్చిమ జర్మనీ, నెదర్లాండ్స్, యూరప్ అంతరిక్ష సంస్థ, అమెరికాలు సంయుక్తంగా నిర్మించగా మరొక పరికరాన్ని అమెరికా, పశ్చిమ జర్మనీ శాస్త్రవేత్తలు కలసి రూపొందించారు.....

(అమెరికా సమాచార శాఖ





?

"My friend says Ravana had never gone to the *Swayamvaram* of Seeta to bend that Great Bow - *Siva Dhanush*. Is that true, Father?" asked Raghu.

"Absolutely, only the later writers added that dramatic element and brought in Ravana to Janaka's Court. In the original *Ramayana*, Ravana learns of Rama and Seeta in the third canto - *Aranya Parva*. Not from Soorpanakha, as generally believed, but thro' Akampana. Soorpanakha just confirms what Akampana has already said," explained Raghu's Father.

"Who is that Akampana? Never heard of him...."

"Akampana was a royal messenger from Janastan - the outpost of Ravana's kingdom. And in Janastan an army of fourteen thousand led by the two generals Khara and Dooshana was completely wiped out. It was a shocking news and Ravana felt that his very base was threatened. And he thought it prudent to wage a war on his own soil with its impregnable fort defended by mighty warriors who were devoted to him heart and soul. The ultimate motive in kidnapping Seeta was only to draw Rama to the battle - front in a terrain most favourable to himself while quite unfamiliar to the opponent ... Ravana in his blind arrogance failed to perceive the innate evil in his own self and paid for it in utter ruination," said Raghu's Father.

---

*Swadharma Swaarajya Sangha (Director : BVSS Mani Beehive Bldgs - 29, Prakasam Road, Madras - 600103.*



# కొత్త పుస్తకాలు

'మా వంశవృక్షం - చరిత్ర' - రచన, ప్రచురణ: కొల్లకుదురు కామేశ్వరమ్మ 8-3-897/, శేషశైల కెయన్ రెడ్డి బిల్డింగ్, నాగార్జున నగర్, ఎల్లారెడ్డి గూడ, హైదరా బాదు - 500 873.

తనలో రగులుతున్న ఆర్తిని పూరించుకోవడానికీ, వెలితిని పూడ్చు కోవడానికీ యిది వ్రాశానని, తనలో కవితా భావాల్ని జాగృతం చేసినభర్త, తన జీవిత ప్రస్థానంలో యాభైఏండ్ల భాగస్వామి అయిన స్వర్గీయ శేషా రెడ్డిని తలుచుకుంటూ చెబుతారు కామేశ్వరమ్మ. వారి కుటుంబంతో ముప్ఫయ్యేళ్ల పరిచయం వున్న రావూరి మురళీధర్ 'ముందుమాట' వ్రాశారు.

క్రీస్తుకి పూర్వం మూడవ శతాబ్ధి అశోకుని శాసనాలలో పేర్కొన్న 'రట్టులు', క్రీస్తు వెనకటి ఆరవ శతాబ్దికి దక్షిణా ప్రధాన 'రాష్ట్ర కూటులు' అయారనీ, వారే కాల క్రమాన రెడ్డుగా మారి వుండవచ్చు ననీ, 1320 నుంచి - 1448 దాకా తెలుగు ప్రాంతాలను పాలించిన కొండ వీటి రాజవంశ చరిత్ర ఈ అభి ప్రాయాలకు ఆధారమనీ, రుద్రమ దేవి (1259 - 1295) కొలువులోని గోనగన్నారెడ్డి గొప్ప సేనాని అనీ, 13 వ శతాబ్దినాటి 'రట్టోడి' శబ్దం రట్టి, రడ్డి, రెడ్డి అయిందనీ, ప్రోలయ వేమారెడ్డి (1320 - 1424) వంశం గాక (కొండవీటి), రాజమహేంద్ర వరంలో మరొక రెడ్డి రాజ్యం (1395 - 1448) కాటయ వేమా రెడ్డి స్థాపించాడనీ, 'మొలక వేమా లమ్మ' అనే గ్రామదేవత కారణంగా 'వేమ' శబ్దం ఈ రెడ్లలో కనిపిస్తోం దనీ, నెల్లూరు గోదావరీ మండలాల గత చరిత్ర పరిచయం చేసిన రచ యిత్రి, 1763 - 64 నుంచి, మాతా మహుల, జననీ జనకుల, అత్త మామల పూర్వీకుల వంశవృక్షం చెబుతారు... రాజు పాలెం నుంచి వేమిరెడ్డి అయిదుగురు కొడుకులూ నెల్లూరు రంగనాయకుల స్వామి తిరు నాళ్లకు రావటం, ఇందుపూరునుం బండ్లలో వచ్చిన ఉన్నత కుటుం స్త్రీలు, ఆనాటి జంగమ దేవర సముచి పాత్ర, వేమిరెడ్డి కొడుకులలో ఒక్క తప్ప మిగతా నలుగురూ ఇందుపూ సంపన్న కుటుంబాలకు ఇల్లరికం వె డానికి అంగీకరించడం, తండ్రి ఆ హించి ఈ నలుగురికీ శ్రాద్ధం పెట్టడ

– అ విధంగా కథ సాగుతుంది....
వేమిరెడ్డి, ఓజిలి, కొల్లకుధురు – ఈ
మూడు వంశాలలోని వారి పెళ్లిళ్ల,
సంతానం, జబ్బులు, ఈ తరంలో
వృద్ధిలోకి వచ్చిన వారూ – యిటు
వంటి సమాచారంతో నిండివున్న
పుస్తకం, బంధుమిత్రులకని ఉద్దే
శించినదిగా తోస్తుంది.

—సుమతీ సాగర్

'పంచబాణ సంచా' కవితా సంపుటి
.... రచన; జె. బాపురెడ్డి. ప్రచు
రణ : జయం పబ్లికేషన్స్, ప్లాట్ 10,
రోడ్డు 5, జుబిలీహిల్స్, హైదరా
బాదు - 34. .. వెల : రు 25–00.

శృంగార వచన కావ్యమైన 'పంచ
బాణ సంచా'ని, తెలుగు సాహిత్య
సంస్కృతులకు బ్రిటన్‌లో చిన్మయ
దీపంగా వెలుగుతున్న ద్వారంపూడి
సుబ్బిరెడ్డికి స్నేహోపాయనంగా
అంకితమిచ్చారు కవి. ఈ పుస్తక
ఆవిష్కరణ, లండన్‌లో 1989
జూన్‌లో, అక్కడి ఆంధ్రా అసోసియే
షన్ ఆధ్వర్యంతో (శ్రీమతి) యోగ
ములుకుట్ల చేశారు. ప్రథమ ప్రతిని
కె. సత్యనారాయణ (FRCS) అభి
మాన పురస్సరంగా అందుకున్నారు.
ముఖచిత్రాలంకరణ : కె. శేషగిరి
రావు.

'శృంగారాన్ని బంగారంగా
మూట గట్టుకొని, కష్టాలగట్లను,
కన్నీటి కాలువలను తరిస్తూ సౌందర్య
మల వేపు సాగిపోయే బాటసారిని
ను.... శృంగార కళలేని జీవితం
మక్కలు లేని ఆకాశం ... గ్రీకు
రోమను వంటి ప్రాచీన నాగరికతా
సంస్కృతులు కూడా రతీ మన్మథులు
మానవ జీవితాల మీద కలిగించిన
ప్రభావాన్ని పవిత్రమైన కళాతత్వ
భావంతోనే గుర్తించి కీర్తించాయి.
శృంగారానికీ వ్యభిచారానికి తేడా
తెలియని సామాజిక నీతి ప్రమాద
కరం ... నాలో పెంపొందే అంత
ర్జాతీయ సాహిత్య చైతన్యానికి దోహ
దం చేస్తున్న ప్రపంచ వ్యాప్త మిత్రు
లందరికీ....' – కృతజ్ఞత చెబుతారు
బాపురెడ్డి, తీయని తలపుల తరగల
థేమ్స్ నదీ తీరం తలుచుకుంటూ !

'నీవు లేని క్షణం ఎకనమిక్ డిప్రె
షన్ – నేను నీతో బ్యాక్ చేయబడి
నపుడు, జీరో పర్చేజింగ్ పవర్‌లో
ఉన్న కన్స్యూమర్ని' – అని చెప్పు
కుంటారు ఎకనామిక్సు సుందరితో.
చిలుకలాంటి ముఖంలో సింహం
హుంకరించిందట పల్లెపూలమాల
నిరాకరించినప్పుడు, నవయౌవనం
పడగలెత్తిన – నాగినులై నడుస్తారు,
బుసకొట్టే పడుచుదనాల – భోగినులై
నిలుస్తారు హాలెండులోని పుత్తడి
బొమ్మలు ; బాల్టిక్ సముద్ర తీరాన –
విసీల శిలాఫలకం మీద – వివస్త్రయై
కూర్చున్న మర్‌మేడ్ – జీవితంలో
మరచిపోలేని మాననీయ మత్స్యకన్య ;
'కామినులు ఆడడం మిధ్య, కళ్లారా
మనం చూడడం మిధ్య' – అని
'సోహో' నుంచి యింటి కొచ్చాక అను
కోగలగాలి ; ప్యారిస్ నగరం నిండా –
కళాపరిమళాల గుబాళింపుతో చక్కని

చిలకలు, చక్కెర బొమ్మలు ; చెకొస్లో వేకియా చిన్నది వెలుగు చీకటులకు వంతెన కట్టిన వెన్నెలజ్యోతి; మత్తెక్కిన హృదయాలతో, సగ్నోద్విగ్న నాట్యాలాడే, కామాగ్ని యజ్ఞాలు చూశాక, వేదవేదాంత కాసారాలలో కళ్లు తుడురుకోవాలనిపిస్తుందట. కళగా ఆరాధింపబడిన శృంగారం, కలగా మిగిలిపోకూడదనీ, కావ్యానందం ఆనంద సౌధానికి బాట వేయాలనీ చక్కటి భావుకతతో, సమకాలీన వాస్తవికతతో చెప్పిన ఈ కవితలు రస రాగమయ వర్ణచిత్రాలు.

—క్షీరసాగరమ్

## దీపావళి సంచికలు

'జాగృతి' - దీపావళి కథల ప్రత్యేక సంచిక 1041, పిబి 104, నారాయణ గూడా, హైదరాబాదు-29 .... సంపాదకులు : వి. రామ్మోహన రావు.... వెల రు 20-00.

కార్తీక వెన్నెల్లో సత్యాకృష్ణులకేళి (సిద్దిపేట కె. రాజయ్య) ముఖచిత్రంగా, ఉత్తరప్రదేశ్ ముఖ్యమంత్రి కళ్యాణ్‌సింగ్ యింటర్‌వ్యూతో, ఎందరో ప్రఖ్యాతుల కథానికలతో, 'జాగృతి' ప్రత్యేక సంచిక తన విశిష్టతను నిలుపుకొంది. "భారతీయ

సంస్కృతిలో ప్రవృత్తి, నివృత్తి అనే పదాలు వినిపిస్తూంటాయి; నామ రూపాలులేని 'మహత్' ఒక దివ్య చైతన్య కేంద్రం, నామరూపాలు దాల్చి విశ్వవ్యాప్తంగా ఎదిగేది ప్రవృత్తి.... మన సంస్కృతి యావత్తూ ప్రతీకాత్మకమైనది. ప్రతి ఆచారానికీ పరమార్థం వేరే ఉంటుంది. అది తెలిస్తే మనోవికాసం; తెలియకపోతే, భౌతికమైన సుఖసంతోషాలు మాత్రమే లభిస్తాయి" - అంటారు 'ఘనశ్యామల' 'తమసోమా జ్యోతిర్గమయ' అనేదాన్ని విశ్లేషిస్తూ, కమ్యూనిజమ్ విఫలమైంది గనక హిందూ సిద్ధాంతం ఒక్కటే ప్రత్యామ్నాయ మనడంలో కొంత ప్రచార ధోరణి కనిపిస్తుంది. ఇక కథకులు: ఇచ్ఛాపురపు జగన్నాథరావు, అవసరాల రామకృష్ణారావు, బలివాడ కాంతారావు, కె రామలక్ష్మి, వాసిరెడ్డి సీతాదేవి, హితశ్రీ, ఇల్లిందల సరస్వతీదేవి, తురగా జానకీరాణి, ఇసుకపల్లి దక్షిణామూర్తి, డా॥ లత, గంధం యాజ్ఞవల్క్య శర్మ, పురాణం సుబ్రహ్మణ్య శర్మ, మాలతీ చందూర్, మంజుశ్రీ, మధురాంతకం రాజారామ్ తమ కథానికలతో ఈ ప్రత్యేక సంచికకు శోభ తెచ్చారు. మల్లంపల్లి విజయకుమార్, వేముగంటి నరసింహాచార్యులు, వేమూరి వెంకటేశ్వర శర్మ, ఎమ్ విజయగోపాల్, పైల కృష్ణారావు, డి కామేశ్వరరావు, జొన్నవిత్తుల రామలింగేశ్వరరావు, అష్టకాల నరసింహరామశర్మ, ఆచార్య తిరుమల, సి వేదవతి తమ కవితా సుమాల నందించారు. కథకు ఆద్యులు ఆర్యులే అంటూ హేమచంద్రుడు సూచించిన దశవిధ భేదాలు చెబుతారు యశోదారెడ్డి. అవేమిటంటే: ఆఖ్యాన, నిదర్శన, మతల్లికా, మణికుల్యా, పరికథా, ఖండకథా, సకలకథా, ఉపకథా, బృహత్కథా, ప్రవల్లికా.... అగ్ని పురాణంలో కథానికా లక్షణం ఉన్నదట. ఆ మాటకొస్తే మన ఉపనిషత్తుల లోను కథలు వున్నాయి. ఆధునిక కథానిక, పాలగుమ్మి పద్మరాజు గారన్నట్లు, మెరుపులా తళుక్కుమని వైచిత్రితో ఊపిరి పోసుకోవాలి. ఈ సంచికలోని అన్నిటికీ కాకపోయినా, కొన్నిటికి ఆ విస్మయానుభూతి కలిగించే లక్షణం లేకపోలేదు. చాలా శ్రమతో ఎంతో శ్రద్ధగా కథానికా రచన గురించి పలువురి అభిప్రాయాలతో వెలువరించిన ఈ ప్రత్యేక సంచిక వెనక గల కృషి ప్రశంసనీయం.

* * *

'రచన' - ప్రారంభ (దీపావళి) ప్రత్యేక సంచిక. సంపాదకులు: వైవియస్సారెస్ శాయి.... పిబి 33, విశాఖపట్నం-1.... వెల రు 10-00.

The Only Magazine Administered by Writers అని చెబుతున్నారు నిర్వాహకులు సీయస్సీ మురళి, వై రాంబాబు+శాయి.... 'మేమేదో పెద్ద వ్యాపారవేత్తలమనీ కాదు. ఎలా ఖర్చు పెట్టాలో తెలియనంత డబ్బున్నవాళ్లమనీ కాదు. పత్రిక నడప

డంలో అనుభవం ఉన్నవారమూ కాము. మాకున్నదల్లా ఒకానొక తపన. ఇప్పుడొస్తున్న సాహిత్యంపట్ల చాలా మందికి అసంతృప్తి ఉంది' — అంటున్నారు నిర్వాహకులు తమ సంపాదకీయంలో. ఆ అసంతృప్తి సాహితీకారులలో వున్నమాట నిజమే! కాని, సామాన్య పాఠకులు తమకి అందుబాటులో వున్నవి చదివి, చదివి నంత త్వరగా మర్చిపోతున్నారు.... ఉత్తరాల ద్వారా అనేక మంది ప్రఖ్యాత రచయితలు ఈ 'ర చ న' వారి సత్ప్ర యత్నానికి, సత్సంకల్పానికి సుస్వాగతం పలికారు. కవనశర్మ 'మాయా బజార్,' గంధం యాజ్ఞవల్క్యశర్మ 'చరణాలు,' భారత ప్రధానికి ప్రవాసాంధ్రుని లేఖ, యర్రంశెట్టి శాయి, బలివాడ కాంతారావు, మల్లాది వెంకట కృష్ణమూర్తి, ఇచ్ఛాపురపు రామ చంద్రం, అర్నాద్, నండూరి పార్థ సారథి, ఘండికోట బ్రహ్మాజీరావు, ఎస్ఆర్ నంది, డి హనుమంతరావు, రాచకొండ విశ్వనాథశాస్త్రి, పివి శేషా రత్నం, భూషణం, ఉప్పల నర శింహం, పొత్తూరి విజయలక్ష్మి, వసుంధర మున్నగువారి రచనలతో, 'భారత రచన' బాపు ముఖచిత్రంతో వెలువడ్డ ఈ 'ర చ న' తను ఆశించిన పంథాలో ముందడుగు వేసి, తెలుగు సాహితీ ప్రపంచంలో నూతన చేతన తీసుకురావాలని మా ఆకాంక్ష. 'ర చ న'కు మా శుభాకాంక్షలు.

✠ ✠ ✠

'క థా ం జ లి' - సంపాదకులు; ఎయన్ రాఘవాచార్.... 10, మురుగేశ మొదలి స్ట్రీట్, మద్రాసు-79... వెల రు 5-00.

'ఆశయం'లోని -విజయశాంతి ముఖచిత్రంగా గల ఈ దీపావళి

సంచిక వర్తమాన రచయితుల కథలూ వ్యాసాలూతో రూపు దిద్దుకుంది. పత్రికా ప్రచురణ వృత్తిగా చేబట్టిన రాఘవాచారి, సాహిత్య పోషణ, సామాజిక స్పృహ, విలువలు - బాధ్యతలు యిలాటి పెద్ద కబుర్లేమీ చెప్పకుండా, ఒంటిగా ఒక్క చేతిమీద 52 ఏళ్ల నుంచి ప్రతినెలా ఈ తెలుగు మాస పత్రికను, క్రమం తప్పకుండా వెలువరిస్తున్నారు. ఆయన అకుంఠిత దీక్షకు, అద్వితీయ కృషికి మా ధన్యవాదములు.

## ఈ మధ్య అందినవి :

చైతన్య స్రవంతి - ఖండకావ్యము ... వట్టిపల్లి సుబ్బరాయడు (బద్వేల్) .... రు. 15-00.

గేయవల్లరి - గోపరాజు హైమవతి (గుడివాడ).... రు. 10-00.

రామానుజాచార్య షష్టిపూర్తి సంచిక. చక్రవర్తి ప్రచురణలు, సికింద్రాబాదు–15.

సరిగమలు - కవితా సంకలనం.... సహృదయ సాహితి, విశాఖపట్నం - 16.... రు. 5–00.

'ప్రమిద' - పక్ష పత్రిక, విజయవాడ-11.... రు 2-00.... ఎడిటర్ : బులుసు వెంకట కామేశ్వరరావు.

మానవతామూర్తి ఆవుల సాంబశివ రావు జీవిత కథనం.... జివి ఆర్ చౌదరి, పుష్పగిరి, మలపట్టు, మద్రాసు-601 301.... రు 20-00.

సూపర్‌స్టార్ కృష్ణ జీవిత చరిత్ర .... జివి ఆర్ చౌదరి, పుష్పగిరి, మలపట్టు, మద్రాసు - 601301.... రు 25-00.

భీష్మగీత - విష్ణు సహస్రనామం. ఖరిదీ హాల్ వేంకటరావు, ప్లాట్ 2, ఆర్ అండ్ డి డిఫెన్స్ ఎన్‌క్లేవ్, సికింద్రాబాదు - 3.

అసమర్థుడి పోరాటం – నవలిక సిహెచ్ వేణు.... జలపాతం దీపావళి సంచికతో ఉచితం.

సర్వ లోక మహోపకారి – (రు 6 - 00) ; విశ్వమానవ ప్రేమ సౌభ్రాతృత్వాలు - (రు 1 - 00) ; మేధావి వర్గం బాధ్యతలు - (రు 2-50); భారతీయ సమాజ సంస్కరణకు - (రు 1-50).......... ....పై నాలుగూ మౌలానా సయ్యద్ అబుల్ హసన్ అలీ నద్వీ ఉర్దు మూలానికి తెలుగు సేత అబ్దుల్ రషీద్. .... మానవతా సందేశమండలి, సిద్ది అంబర్ బజార్, హైదరాబాదు - 12.

తెలుగు సాహిత్య పరిమళ్ (హిందీలో).... భీమసేన్ నిర్మల్ ....దక్షిణాంచలీయ సాహిత్య సమితి, హైదరాబాదు-380... రు 130-00.

**Buddhiyoga of the Gita and other Essays by Anirvan ... Samata Books, Madras - 6 Rs 50-00**

వామన వృక్షాలు - యన్ మంగాదేవి.... న్యూ స్టూడెంట్స్ బుక్ సెంటర్, అరండల్ పేట, గుంటూరు .... రు 100-00.

సంక్షిప్త భాగాలు

# 'నా రాట్న చక్రం'

## తల్లాప్రగడ ప్రకాశరాయుడు

గాంధీ గారికి సత్యాగ్రహోద్యమం, నిర్మాణ కార్యక్రమం రెండు నేత్రాల వంటివి ; రెండూ పరస్పర ఆశ్రితాలు. స్వాతంత్ర్య పోరాటంలో ఒక భాగమైన 'వ్యక్తి సత్యాగ్రహానికి' ప్రప్రథములుగా ఆయన వినోబా భావెని ఎన్నుకున్నారు ; జవహర్‌లాల్ నెహ్రూ రెండవవారు. 'జాతి పిత'గా దేశం గాంధీజీని గౌరవించి, సర్వోదయ సిద్ధాంతానికి కాస్త ఊపిరి నిచ్చిందే గాని, గాంధేయ పథం విస్మృతి పథాన పడింది.... రాజకీయ పదవులు ఆశించకుండా, గాంధీజమ్‌కి కట్టుబడి, నిర్మాణ కార్యక్రమానికి అంకితమైన మహానుభావులలో తల్లాప్రగడ ప్రకాశరాయడు గారొకరు.... కేసరిగారి 'చిన్ననాటి ముచ్చట్లు' చదివి మెచ్చుకున్న పాఠకులు, అటువంటిదే మరొకటి వేయమని కోరగా, ప్రకాశరాయడిగారి జీవితం సంక్షిప్త పరిచయం చేదామని అనిపించి, బుద్ధప్రసాద్ గారికి, రాజారామ్ గారికి అనుమతికోసం వ్రాశాము. ఇరువురూ వెంటనే అంగీకరించినందుకు మా మనఃపూర్వక కృతజ్ఞతలు.

Those whom the gods love die yong' పస్తుఫారంలో (1904) మా ఉపాధ్యాయుని నోట మేము మొదటిసారిగా విన్న సత్యవాక్కుయిది. 16, 17 ఏండ్లవయస్సు గల ఆ పద్మావతికి సరిపడినట్లు యిప్పటికి 90 యేండ్లు చెడ బ్రతికిన నాకు నప్పదిది !

### 17

### కలకత్తా

నా పుస్తకపు చదువుల పూర్తికి ఈ యధ్యాయమొక్కటి మిగిలియుంది. దానితో 'నా జ్ఞాపకాల' మొదటి భాగం ముగింపుకు తెస్తాను. అట్లా రాజమంద్రిలో వీరేశలింగం హైస్కూలు

అధ్యాపకవృత్తి అయిన తరువాత ఆ పై డిగ్రీ చదువు మీదికి వెళ్లింది బుద్ధి. తండ్రిని మించిన తండ్రిగా మమ్మూ పెంచిన మేనమామ శేషయ్య గారు 1915లో మహాళయ అమావాస్య రోజున దివంగతుడైనాడు. తెలుగు వాళ్లకు దగ్గరగా మద్రాసు యూనివర్సిటీ ఒకటుంది. ప్రైవేటుగా పరీక్షకు హాజరై M.A. లైన వారుండిరి. కాని దూరపు ప్రయాణమైనా నేను కలకత్తా వెళ్లి అక్కడి యూనివర్సిటీ ప్రొఫెసర్ల వద్ద రెండేళ్లూ శుశ్రూష చేయడానికే నిశ్చయించాను. రెండేండ్లక్కడ గడపదలచడంలో చదువుకు మించిన ముఖ్యకారణం వేరొకటుండెను. అప్పటికే బ్రాహ్మ ప్రార్థన సమాజ పెద్దల వద్ద లభించిన శుశ్రూషాసౌరభం జీవితానికి కాస్త పట్టి యుండటం చేత కలకత్తాకు వెళ్లడానికే నిశ్చయించుకున్నాను. అక్కడి బ్రాహ్మధర్మవాతావరణంలో రెండేళ్లపాటు బ్రతికితే జీవితానికి ప్రయోజనముండగలదనే ఆశ నన్ను కలకత్తాకు పంపించింది. బ్రాహ్మ సామాజికులు కానివారు తక్కువవారని, వారికి ఆధ్యాత్మికోన్నతి యుండదనే పాక్షిక దృష్టి ఆనాడు కూడా నాకు లేదు. "ఏకం సత్ ; విప్రాః బహుధా వదంతి" అనే సార్వజనిక సత్యమే నా జీవితాదర్శం. ఈ నాటికి గూడా ఎట్టి పాక్షిక మతభావం నాలో లేనందు వల్ల నేను అదృష్టవంతుడను. ఏ మతానికిగాని బొడ్డుకోసి పేరుపెట్టడం; అందరు వచ్చి దానిలో చేరవలెనని చెప్పే హెూరా హెూరీ వీధి ప్రచారాలు చేయడం నాకు బాధాకరమైన విషయం. అన్ని మతాలూ అపూర్ణాలే. పూర్ణత్వానికి మెట్లు కట్టుకుంటూ పోవడమే నిజమైన మతధర్మం. లేదా మరొక భాషలో చెప్పకో వలసి వస్తే, త్యాగమూర్తులగు మహర్షులు, మహాత్ములు సత్యాన్ని తరిచి నిస్స్వార్థంగా పెట్టుకున్న, చేరుకున్న ఒక హద్దు అక్కడికక్కడ అది పూర్ణమే. మనం ఎన్ని మెట్లు పైకెక్క గలిగితే, అన్ని మెట్లు అది మనకోసం క్రింది దిగివస్తూ, యింకా కొంచెం పూర్ణమవుతూవుంటుంది. ఇది ధర్మాన్ని గురించి నాకు నేను నిర్మించుకునే చిత్రణ రా రమ్మని పిలుస్తూ లోపల ఒకభావ ముంది ; కాని నా భాష మరి దానిని వ్యక్తపరుస్తోందో లేదో ! నాలోనాకే సువ్యక్తం కావలసింది యింకెంతో వుంది. అదట్లా వుంచండి.

వీరేశలింగం, వేంకటరత్నం గార్లతో నేననుభవించిన అనుచరత్వం, అందు ముఖ్యంగా రెండవ వారి పట్ల చేసిన అంతే వాసిత్వం నాదృష్టిని కలకత్తా వైపు మరలించింది. కలకత్తా నివాసానికై కొంత డబ్బు సర్దుతానని నరసింహశర్మ ధైర్యమిచ్చాడు. అన్నట్లే చేశాడు కూడ. రెండేడ్ల పిదప తిరిగి వచ్చి, మాకుండిన యిల్లూ దొడ్డీ కాబోలు అమ్మివేసి వడ్డీ లేకుండ అసలు మాత్రం తీర్చివేశాను. కొద్దిగా మిగిలి వుండిన భూమి (మూడు ఎకరాలు) మీద

కొంచెం శిస్తు వచ్చేది. ఉన్న పొల
మంతా మా తండ్రి వేసిన బుణాల
తీర్మానానికి నా చిన్నప్పుడే వెళ్లి
పోయింది. 17, 18 ఏండ్లవయస్సు
గల నా భార్యతో సహా కలకత్తాకు
ప్రయాణమైనాను. 1918 జూలై,
ఆగష్టులలో ఆ ప్రయాణం జరిగింది.
ధర్మ ప్రచారానికి జీవితాన్ని అంకితం
జేసుకొన్న బాబూ హేమా చంద్ర
సర్కారు M. A, మాకు కలకత్తాలో
గార్డియన్. ధర్మ ప్రచారకార్యం మీద
తరుచు తెలుగు దేశానికి వచ్చి వెడు
తూన్నందు వల్ల ఆయన నాకు సన్ని
హితుడు, భక్తి భాజనుడు. ప్రఖ్యాత
వృక్షశాస్త్ర ఆవిష్కర్తయైన సర్
జె. సి. బోసుగారి బావగారాయన.
సుకియావీధి రాధా ప్రసాద్ గల్లీలోని
ఒక బెంగాలీ కుటుంబంతో మాకు
రెండుగదుల మకాం ఏర్పాటు
చేశాడు. ఆ కుటుంబంవారి మంచితనం
చొప్పున రెండేళ్లూ చాలా సుఖంగా
గడిచిపోయినాయి. చదువుకోసం ట్రామ్
బండ్ల మీద యూనివర్సిటీకి హాజరు;
ఆదివారాలు సాయంకాలం సాధారణ
బ్రహ్మ సమాజ సమావేశాలకు
వెళ్లడం; కొంత మంది బ్రాహ్మ
బెంగాలీ పెద్దలతో సర్కారు బాబు
ద్వారా పరిచయ మేర్పడటం; వారి
యిండ్లలో జరిగే బ్రహ్మోపాసనా
సమావేశాలకు వెళ్లడం; (అక్కడనే
భోజనం కూడ); బ్రహ్మ సాధనాశ్ర
మంలో భార్యలతో సహా వచ్చి ట్రెయి
నింగు పొందుతూన్న కొందరు ఆంధ్ర
మిత్రులను తరుచు కలుసుకొనడం;
నా వలెనే తెలుగు ప్రాంతం నుండి
చదువు నిమిత్తం వచ్చిన పాత కొత్త

వారిలో పరిచయం, స్నేహం — ఈ విధంగా రెండేండ్ల కాలం గడిచింది.... మరపురాని సంఘటన మరొకటుంది. బ్రాహ్మధర్మ సౌధాన్ని వరుస వెంబడి నిర్మించి నిలిపిన నాలుగు ముఖ్య స్తంభాలలో శ్రీ శివనాథ శాస్త్రి మహాశయుడొకడు. రామమోహన, దేవేంద్రనాథ, కేశవ చంద్రుల తరువాత అగ్రపీఠం శాస్త్రి మహాశయునిదే. 1919 నాటికే ఆయన శతవృద్ధుడయారు. ఉపాసనా మందిరంలో ఆ మహాశయుని ఈశ్వరోపాసన ప్రసంగాలతో ఆ హాలు మారుమ్రోగి సమావిష్టుల హృదయాలు ద్రవీభూతము లయ్యేవని మేము విని యుండిన మాట. వృద్ధాప్యం వల్ల కొంత కాలంగా ఆయన మందిరానికి వెళ్లడం మానుకున్నాడు. కనుక మేము ముగ్గురం - రామస్వామి, రామమూర్తి, నేను - కలిసి ఆయన నివాసానికి వెళ్లాం - నమస్కంరిచాము. శయ్యపై లేచి కూర్చుని, సంతోషంతో మా కాయన స్వాగతం పలికాడు. "యువక సోదరులారా, నా కాలం నిండింది. అంతేగాక శరీరం రోగ భూయిష్ట మయింది. మీరు బ్రాహ్మ ధర్మ విశ్వాసులై యుండటం నాకు ఆనందదాయకం. ఇంకేమి చెప్పేది - **Live, live for Brahma Dharma. God bl es you all** అంటూ మాకు వీడ్కోలు చెప్పాడు. నేనక్కడ ఉన్న రోజులలోనే ఆయన నిర్యాణం పొందాడు. మృతదేహం వెంట మేము గూడ శశ్మానవాటిక (నీంతొల ఘాట్) కు అందరితో పాటు పాదచారులమై వెళ్లాము. ఇప్పటికీ నాకొక సంగతి జ్ఞాపకం. శ్మశాన వాటిక చాల దూరం. శవపేటిక వీధుల వెంట వెడుతూ వుండగా, యిరు ప్రక్కలా పౌర జనులు, స్త్రీ పురుషులు, వీధి గుమ్మాల వద్ద నిలబడి, వీధి వెంట నడిచిపోయే వాళ్లు కూడ, 'హరి బోల్ హరి బోల్' అనే దైవస్మరణ చేయడం పలుచోట్ల వినవచ్చింది. ఈ సహానుభూతిలోని తాత్పర్యం దానికదే చెప్పుకుంటోంది. ఇతర రాష్ట్రాల మాట నాకు తెలియదు కాని, తెలుగుదేశంలో కంటె, ఉత్కళ, వంగ రాష్ట్రాల సామాన్య ప్రజల భక్తి ప్రపత్తి అధికమని తోస్తుంది. గౌరాంగుని వంటి మహా భక్తులకు పుట్టినిల్లు ఆ ప్రాంతం. వివేక శూన్యమైన గంజాయి - భక్తి కూడ అక్కడనే వుంది. కలకత్తా విద్యార్థిగా బజారు నుండి కూరలబుట్ట చేత బట్టుకొని, యింటికి నేను వెడుతూ చూచే వాణ్ణి.

దేశమంతా అట్లాగొడ్డుపోలేదని నా కలకత్తా అనుభవాలే నాకు సాక్ష్యం. పరమహంస శ్రీరామకృష్ణ దివ్యజ్ఞాన సమాజం: ఆర్యసమాజం; భారత జాతీయ కాంగ్రెసు - మున్నగు ఉద్యమాలతో జాతి జీవితాన్ని ఉద్ధరింప కంకణం గట్టుకొన్న ఉద్దండు లెందరో, నిర్భయులై, సత్వగుణ సంపన్నులై, వివిధ రంగాలలో ముందుకు వచ్చిన వారిని దర్శించి, వారిని గూర్చిన విశేషాలు విని ధైర్యస్థైర్యాలు పొందాను.

అంతేకాదు - కార్మికులు, కూలి జనులు, అంగరక్షగా చిన్న పంచె కట్టు, పైన తుండుగుడ్డ వేసుకొని వీధి గట్లపై కూర్చుండి, రాళ్లవంటి పచ్చి శెనగ్గింజలు ఒడిలో పోసుకొని, ఉప్పు, పచ్చి మిరపకాయ అనుపానంతో వాటిని నములుతూ, పిచ్చాపాటీ చెప్పు కుంటూ, కూలిపిలుపులకై నిరీక్షించ డం తరచు నా కండ్లబడిన దృశ్యం. మెట్ట ప్రదేశాల నుండి వచ్చే కష్ట జీవులు వాళ్లు. శెనగలు ఆ ప్రాంతపు పశువులదాణా దానికి horse gram అని అక్కడి పేరు. మరేదీ లేనప్పుడు బీదల భోజనం కూడ అదే. బీదలతో చెలిమి వల్ల, వారి కష్టాలను తమవిగా చేసుకొని, కొద్దితో ఆకలి తీర్చు కుంటూ, ఐచ్ఛిక దారిద్ర్యాన్ని స్వీక రించేవారు కూడ సకృతుగా ఉన్నారు. ధర్మజీవననిష్ఠుడు, శిష్టాచార్యుడు, బ్రహ్మానందకేశవచంద్రసేన్ అంటాడు:

"My feelings, tastes and motives, my blood and my brains, all belong to the order of the poor. My spirit is the spirit of the poor. My body is the body of the humble"

బహు చిన్న మోతాదులో, ఈ అల్పజీవి, ప్రకాశరాయని feeling tastes and motives etc. కూడ, కాస్త జ్ఞానం అబ్బిన వయసు నుండి అవే. అవేయన్నట్లు నా మనస్సు నాకు చెపుతోంది, దానికి జోడింపుగా, లేక అదనంగా, తాను 1945 లో చని పోయేవరకూ, 70 యేండ్లకు పైగా బ్రతికియుండిన మా అమ్మమాట నాకొక విధంగా వేదవాక్కు. నా ఆరేండ్లప్పుడు చనిపోయిన తండ్రిని నేనంతగా యెరుగకపోయినా, నన్నూ, నా చెల్లెళ్లిద్దర్నీ, తన సర్వస్వంగా ఒడి గట్టుకొని, తన తమ్ముని పోషకత్వం క్రింద, నా చదువుల నిమిత్తం, ఊరూరూ తిప్పుతూ శ్రమల నందిన మా అమ్మే అమ్మ! అక్షరం ముక్క, లోకవ్యవహారాలు ఎరుగని ఆమెకు తన తమ్ముని అండే అండ! మా తండ్రికి మాత్రం తెలిసిందేమి— నాల్గవ తరగతి వరకూ ఉంగుటూరు పల్లెచదువు, పల్లెబ్రతుకు, పంట పొలాలు తిరగడంతో దానంతట అదే అబ్బిన సేద్యకళ, నాకు కొంత ప్రాయం వచ్చిన దాదిగా మా అమ్మ యిచ్చిన ఆశీర్వాద భిక్ష, నా మానసిక తత్వాన్ని బట్టి గర్వకారణమయిందనే చెప్పుకోవాలి.

వినికిడి వల్లను, ముఖాముఖి దర్శ నం వల్లను, నన్నాకర్షించిన బంగాళీ పెద్దల పేర్లను వారి దేశసేవాభిజ్ఞ తను తలపుకు తెచ్చుకొనడం నా జ్ఞాప కాల కథకు కొంచెం వన్నె పెడుతుం దనుకుంటాను. 'Memories are treasures no one can steal మనుష్యుల శీలాన్ని, నడవడిని బాగు పరచే మంచి జ్ఞాపకాలన్నీ బ్రతుకులోని ముఖ్య భాగం. అవి దైవదత్తమైన ఉత్తమ సాధనాలు, అన్నాడు కదా Longfellow తన Psalm of life - లో 'Lives of greatmen remind us'

.... అని! ఒకసారి హృద్గమైతే మరపురాని కవి హెచ్చరిక యిది.

ఆధునిక యుగంలో ఆధునిక, సంఘసంస్కార, రాజకీయాది విషయ వివేచన, ధర్మ వ్యాప్తి పేరట రాష్ట్రా లన్నిటిలో ముందు పేర్కొనవలసింది వంగరాష్ట్రం. భారత జాతి యొక్క సమగ్ర సంస్క్రియకు అంకురార్పణ చేసిన దేశికాచార్యుడు రామమోహన -రాయలు. అందుకే ఆయనకు నవ భారతపితయనే నామం సార్థకమ యింది. తదుపరి కొంతకాలానికి 1885లో భారత జాతీయ కాంగ్రెసు పుట్టుకతోను దాని జాతి ధర్మసందేశ వ్యాప్తితోను, ఎడి హ్యూమ్, సర్ విలియమ్ వెడర్ బర్న్, దాదాభాయ్ నౌరోజీ ప్రభృతుల హితోపదేశాల తోను దేశంలో ఒక నూతన చైతన్యం అందుకుంది. ఆ మీదట బ్రహ్మధర్మ విజ్ఞాననిధి ఆనందమోహన్ బోసు భారత జాతీయ కాంగ్రెసు అధ్యక్షత వహించడంతో పరిశుద్ధాస్తిక ధర్మం, దేశ సేవా ధర్మం - రెండూ కలిసి జాతికొక సంపూర్ణ జీవితపథాన్ని కనబరి చాయి. చాలా కాలం తరువాత మహాత్మగాంధి వచ్చి అదే పంథాలో అదే పని చేశాడు. 'సత్యాగ్రహ'మనే పేరుతో రాజకీయాలను ధర్మబద్ధ మొనర్చాడాయన. ''Politics divorced from religion is

absolute dirt'' అని అతని నిర్వచనం. అట్లాగే మతం పేరిట మడి కట్టుకొని ''రాజకీయా లెట్లావుంటే మాకేమి ? వాటితో మాకేం పని ?'' అని యంటూ రాజకీయ దొంగలకు దోపిడిగాండ్రకు దోసిలొగ్గి పబ్బం గడుపునే మెట్టవేదాంతులు గాంధి దృష్టిలో ఒక విధంగా మాతృ ద్రోహులే. జ్ఞానం విజ్ఞానం, మానం ప్రాణం, మర్యాద మంచి తనం — వీటికి పెడర్థాలు! తప్పుడర్థాలు సృష్టించే స్వేచ్ఛ ఎవరిచ్చారు ? 'What is a smile ?'' అనే ప్రశ్నకు ''It is but a twisting the lip, in a particular way'' అని జవాబిచ్చిన పెద్ద మనిషి గట్టి, గడ్డు సెంటిస్టే అయి యుంటాడు. ....ఇక నిప్పుడు కొన్ని రాజ్యాలు తయారుచేయించుకుంటూన్న అణ్వస్త్ర రాక్షసత్వంతో సైంటిస్టుల దుష్టత్వం పరాకాష్ట చేరుకుంది. వీటినన్నిటినీ ఖండించి ఒక ధర్మజీవన సూత్రాన్ని ఒక రక్షామంత్రాన్ని మొత్తం ప్రపంచానికి వినిపించినవాడు మహాత్మాగాంధి. అంతకు కొంచెం పూర్వుడే వంగదేశ విజ్ఞానజ్యోతి ఈశ్వరచంద్ర విద్యాసాగరుడు. కలకత్తాలో నేను దర్శించిన మహనీయులు అప్పటికింకా కొందరుండిరి ; బాబూ కృష్ణకుమార్ మిత్ర, లలిత మోహన్ దాస్, రామానంద ఛటర్జీ, సీతానాధ తత్వభూషణ్, హేరంబ చంద్ర మైత్రా ప్రభృతుల దర్శన పరిచయాల స్మృతులు ఇప్పటికిని నాలో నిలిచియున్నాయి. తలచిన మాత్రాన అవి నా జీవితాన్ని పైకెత్తుతున్నాయి. మొదటి యిరువుర్యూ 1907 - 8 సంవత్సరాలలో నిర్భయులై పాల్గొన్న పనిచేసిన వందేమాతరోద్యమం, ఆదర్శ ప్రాయమై నన్నెంతగానో ఆకర్షించింది. పూర్వకాలపు ఇంగ్లాండు పత్రిక 'Review of Reviews' ఆధిపత్యం వహించి యుండిన W. T. Stead వంటివాడే మన 'Modern Review' పత్రికాధిపతి, శ్రీ రామానంద చటర్జీ. ఈయన నొకసారి రాజమహేంద్రవర ప్రార్థన మందిర వేదికపైనను, తదుపరి కొన్నిసార్లు వారి కలకత్తా నివాసగృహంలోను దర్శించాను. హైకోరు న్యాయాధిపతి (అని జ్ఞాపకం) శ్రీ అసతోష్ ముఖర్జీని, యూనివర్సిటీ ఉపాధ్యక్షుడుగా, పలుసార్లు యూనివర్సిటీ వరండాలలోనే చూస్తుండేవాడను. ఆయన ఎదురైనప్పుడు యూనివర్సిటిలోని బెంగాలీ ప్రొఫెసర్లు కేవలం పాదాల కొరిగి ఆయనకు ప్రణమిల్లడం నేను చూచాను. అంతటి నిరాడంబరుడు, సత్వగుణ సంపన్నుడు ఆయన. యూనివర్సిటీ భవనంలోనే ఒక అంతస్తు మెట్ల ప్రక్కన శ్రీ అసుతోష్ యొక్క పాలరాతి పెద్ద విగ్రహం నెలకొల్పబడియుంది. దాని క్రింద భాగంలో ''The man gave a prominent place to the mother tongue in the step-mother's hall'' అనే మాటలు చెక్కబడి వున్నాయి. ఈశ్వర చంద్ర విద్యా సాగరుడు సాక్షాత్తు విద్యాసాగరుడే కదా. ఒక

సందర్భంలో కళాశాలాధికారులు ప్రిన్సిపల్ పదవిని చేపట్టమని ఆయనను కోరగా - 'నేనుకాదు. నాకంటె పెద్దలు కండ్ల కగపడుతూండగా నేనెట్లా ప్రిన్సిపల్ నవుతాను? ఆయన పిదప నేను బ్రతికియుంటే, నా సంగతి అప్పుడు చూడవచ్చు' అని జవాబిచ్చిన మహారాజు వి ద్యా సా గ రు డు. అతడు వితంతు పునర్వివాహాలు చేయ ప్రారంభించినపుడు, 'ఇదేం పనిరా నాయనా!' అని తల్లి ప్రశ్నించినపుడు, 'ఇదిగోనమ్మా చూడు - ఈ వివాహాలపట్ల ధర్మశాస్త్రాల పూర్ణాంగీకార మిదిగో' అని చెప్పి గ్రంథప్రామాణ్యాల నెత్తిచూపించి, స్త్రీ పునర్వివాహాలకు ఈదేశంలో నాంది పలికిన వాడు విద్యాసాగర్. చిన్నచిన్న ఆర్థిక సహాయాలు చేస్తూ, ఆయన నిలబెట్టిన బీదకుటుంబాలెన్నో వుండె. అప్పుడపుడు వారి నివాసాలకు వెళ్లి వారి యోగక్షేమం తెలుసుకుంటూ వుండిన బీదలపాలిటి కల్పతరువతను. రైలు స్టేషన్ నుండి ఒక నవనాగరికుని పెట్టె, సంచి కూలివాని వలె మోసుకొని వెళ్లి గుమ్మంలోపల దింపి, కూలి డబ్బు తీయడానికి ఆ నాగరికుడు డబ్బు సంచి తీస్తుండగా, అక్కడ నిలవకుండా కనబడకుండ అంతర్ధానమైనవాడు విద్యాసాగరుడు. వీపున చొక్కాకూడ లేకుండ, అంగవస్త్రం మాత్రం ధరించి వీథులలో కనబడుతూ, గవర్నర్ల నమస్కృతు లందుకున్న అవతారమూర్తి విద్యాసాగరుడు. పరుల పొగడ్తలు, అభినందనలు ఆ మహనీయునికి తృణప్రాయం. ఆ మనిషి జీవితకథ చదువుకొని, జ్ఞాపకం పెట్టుకొనడమే ఈ జన్మకొక లాభం - కలకత్తా విశ్వవిద్యాలయాధ్యాపకులలో నాకు దర్శన మిచ్చిన వినయశీలుడు శ్రీ బ్రజేంద్రనాధ సీల్. యూనివర్సిటీ తత్వశాస్త్రాధిపత్య పీఠం ఆయనది. అతడింగ్లాండు వెళ్లి చేసిన విద్వత్ప్రసంగం విని, శ్రోత లతణ్ణి ఘనంగా ప్రశంసించారట. అప్పుడతడు 'What am I? I am only a seal; there are whales in my country' అని బ్రజేంద్రనాధ్ సీల్ జవాబిచ్చాడట. విజ్ఞాన నిధులు, నిర్భయులు, సాధుపుంగవులు వీరందరు. శ్రీ సీతానాథ్ తత్వభూషణ్ పేరు పైజాబితాలో చేర్చినానో లేదో, ధర్మశాస్త్ర గ్రంథాల నెన్నిటినో ఆమూలాగ్రం పఠించి, సరిచూచి, విషయాలను క్రోడీకరించి, తన వ్యాఖ్యానంతో సహా, తిరిగి ఆయన గ్రంథస్థం చేసిన వెన్నో వున్నాయి - దానినీ దీనినీ ఖండించి ఊరక తీసి పారవేసినవీ కావు ఆయన వ్రాతలు; గుడ్డి తనంగా అన్నిటినీ సమర్థించే మండనాలూకావు. మనుష్యలనూ, వారి వ్రాతలను విమర్శించడంలో, విమర్శకుని మానవత, అతని దృష్టి వైశాల్యం పరీక్షకు వస్తాయి. అట్లా పురాతన వేదశాస్త్ర పురాణాలను పరిశీలించడంలో, అప్పటి దేశకాల పాత్రాదుల స్థితిగతులను మనసున బెట్టుకొని, వాటిబాగోగులను నిర్ణయించాలి. ఏలనంటే, భాష, భావం

రెండూ పరమేశ్వరు డిచ్చినవేయైనా, భాష వల్ల వచ్చే తేడాలు, సందేహాలు భావంలో విడిపోయి, మనస్సును కుదుటపరుస్తాయి. ఒక్కొక్కప్పుడు వాచ్యార్థాన్ని దిగదుడుపు పెట్టి, లక్ష్యార్థసత్యాన్ని ఖాయం చేసే చివరి తీర్పు అంతఃస్ఫురణలో నిండియుంటుంది. క్రీస్తు ప్రభువు ప్రవచించినట్లు, సత్యం (ధర్మం) వయోవృద్ధుల చమత్కార వాద ప్రతివాదాల్లో గాక, చంటిబిడ్డల చూపుల్లోను, మాటలురాని వారి పెదవుల మీదను తాండవిస్తూ వుంటుంది. ఆపైన ఆ శిశువులను తొట్టిలోనుంచి లాలించే అమాయక తల్లుల పాటల్లో తొణుకాడుతూ వుంటుంది. వంశీయుడగు తత్వభూషణ్ మహాశయుణ్ణి అప్పుడప్పుడు వారి నివాసంలోనే మేము దర్శించడం కలదు. ఆయన నికరమైన తత్వశాస్త్ర వ్యాఖ్యాత, విమర్శకుడు అని నా అభిప్రాయం. ఆయన గ్రంధాలలో కొన్నిటిని చూచియుండిన అనుభవం వల్ల ఏర్పడిన అభిప్రాయం నాది. ఆయన రచనలలో సర్వజనాంగీకృత విశాలదృష్టి, సకల మత సమన్వయం కాన వస్తుంటుంది. బ్రాహ్మధర్మ దిగ్గజాలలో మళ్లీ అట్టి సమన్వయ దృష్టి కేశవచంద్రసేన్ లోను, కవి ద్రష్ట రవీంద్రునిలోను కనబడుతుంది. బ్రహ్మానందుని ధర్మ తత్యం పేరే 'Religion of Harmony' కదా! బ్రహ్మసమాజం రెండుగా విడిపోయిన విభాగాలతో సంబంధం పెట్టుకొనకుండ, రవీంద్రుడు వాటి సమన్వయాన్ని సమత్వాన్ని పాటించాడు. 'సత్కవుల్ హాలికులైననేమి ?' అన్నట్లు 'శాంతినికేతనం - శ్రీ నికేతనం (వ్యవసాయక్షేత్రం)' - రెంటినీ జోడించి నడిపించిన హాలికుడే రవీంద్రుడు... జ్ఞాపకాలున్నంతమట్టుకు యిట్టి పూర్వస్మృతులను నాకు నేను చెప్పుకోగలగడం కోసమే, నా జీవితోప కృతికి వాటిని వినియోగించుకొనడం కోసమే నేను యూనివర్సిటీ చదువుకు కలకత్తాను ఎన్నుకొన్న యుద్దేశం. ఈ యాశయం కూడ కొంతవరకు నెరవేరింది.

ఇక అక్కడి చదువులో నేను పొందిన అనుభవ లాభం కొంచెం చెప్పుకొని, ఈ పుస్తక ప్రథమభాగాన్ని ముగిస్తాను. అక్కడ నా మనసును బాగా చూరగొన్న కొద్దిమంది అధ్యాపకుల పేర్లను మాత్రమే ఉదహరిస్తాను... సిటీకాలేజి ప్రిన్సిపాల్ శ్రీ హేరంబచంద్ర మైత్రా మాకు Wordsworth చెప్పడానికి కొన్నిదినాల కొకసారి యూనివర్సిటీకి వచ్చేవారు. అసలు యూనివర్సిటి జీతాలు పుచ్చుకునే ప్రొఫెసర్లు కొందరుండగా, ఇతర ముఖ్య కాలేజీల అధ్యక్షులు, ప్రధానాధ్యాపకులు గూడా, గౌరవ పూర్వకంగా యూనివర్సిటీకి ఆహ్వానింప బడేవారు. అట్టివారిలో నాకరు హేరంబచంద్ర మైత్రా. ఆయనది నిండైన తెల్లని సుందర విగ్రహం. నడిమి వయసు దాటిన వృద్ధ స్వరూపం. పలికే ప్రతిమాట స్పష్టాతి స్పష్టంగా, గట్టిగా వినవచ్చే కంచు కంఠం. జర్మన్ గెటే ప్రవచనం, అప్పు

డపుడు విధాయకంగా ఆయన నోట వెలువడుతుండేది. యావన్మానవాళికీ ప్రాణావసరమగు 'Life begins with renunciation' అనే జీవనోద్ధారక మంత్రం మొదట ఆయన నోటనే నేను వినియుంటిని. నాటినుండి మన సున పట్టియుంది. ఆయన మాకు బోధించే విషయాలుకూడా - అందు లోనూ అవి Wordsworth పాఠాలు గెటే తత్వానికి దగ్గర చుట్టాలే కదా! ప్రొఫెసర్ మైత్రాగారి వ్యక్తిజీవిత సరళికూడా యిందుకు సరిపడియే యుండునని నా అంచనా.... ఇకపోతే శ్రీ అరవిందఘోష్ సోదరుడో, సన్నిహితుడో (అని వినికిడి) ఒకానొక ఘోష్ 'Atalanta in Calydon' నాటకం బోధించేవారు. అతి నెమ్మదియైన కంఠధ్వని, బహు సాత్త్వికస్వరూపం ఆయనది. జుట్టు క్రాపింగు వంటిది గాక, అదేదో అరవిందుని గిరిజాల వలె, మెడమీదికి వాలియుండేది. ఆయన చూపులో, ముఖంలో, మాటలో ఒక విధమైన ఋష్యాకారం నాకు గోచరించేది.... అందరినీమించి నన్నెక్కువగా ఆకర్షించిన అధ్యాపకపాత్ర డాక్టర్



## 'జగతి' చందా కూపను

2, కచేరి రోడ్డు - పి.బి. 2922
మైలాపూరు- మద్రాసు-600 004

ఈ నెల నుంచి 24 సంచికలు పంపగోరుతూ రు. 50/-కు (ఏభై) బాంకు డ్రాఫ్టు లేదా పోస్టల్ ఆర్డరు లేదా మనియార్డరు రసీదు ఇందుతో జత పరిచినాను.

పేరు ........................................

అడ్రసు ........................................

........................................

........................................

తేదీ : సంతకం

JAGATI - 2, Kutchery Road, P.B. 2922, Mylapore, Madras-600004



స్టీఫెన్‌ది. వయస్సెంతోగాని ముదుసలి వలె కనిపించేవా డాయన.

'Take no thought of what you shall eat or drink and wear for your raiment. Seek ye first the Kingdom of God and all the rest shall be added unto you. Look at the lilies of the field etc'. అని క్రీస్తు చూపిన మార్గమే స్టీఫెన్ తన జీవితం ద్వారా మాకు చూపించాడు. జాన్ రస్కిన్ "Unto this last" లో మంగలి వృత్తికీ, లాయరు వృత్తికీ అణుమాత్రం తేడా లేదంటాడు. ఆర్థి కంగాను, నైతికంగాను, రెంటిదీ ఒకే విలువ, ఒకే మర్యాద. రెంటిలో భేదం కల్పించే దృష్టి అక్రమం, అమానుషం! Dr. Stephen మహా మనీషి. బెంగాలీ పెద్దలందరితో పాటు ముఖ్యంగా డాక్టర్ స్టీఫెన్, జీవితమనే ప్రత్యక్షపాఠాన్ని (అది నాకెంతమట్టుకు ఒంటబట్టిందో కాని) కండ్లార చూడడానికే నా కలకత్తా చదువు ఏర్పాటయిందోయేమో!

మా యూనివర్సిటీ తుది పరీక్షలు మామూలుగా 1920 ఏప్రిల్‌లో జరగకుండ, ఆయేడు సెప్టెంబరులో జరిగాయి. ఏప్రిల్ ప్రాంతంలో నగ రంలో మాశూచి వ్యాధి వ్యాపించడం వల్ల మమ్మందర్నీ ఎవరి యూళ్లకు వాళ్లను పొమ్మన్నారు. ఏలనో కాని నేనూ నా చిన్నవయసు భార్యా, పరీ క్షల వరకూ కలకత్తాలో ఉండిపోవ డానికే నిశ్చయించుకున్నాము. మాకు మశూచి రాలేదు. కాని, యిరువురకూ ఏక కాలంలో ఒక రకమైన 'మీజిల్' [red rash అంటారు) తగిలింది. ఎట్లా విన్నాడో యేమో, క్లాసులో నాతో పరిచయం కూడలేని ఒక బెంగాలీ యువక విద్యార్థి, బారిసాల్ జిల్లా, బెయిసారీ గ్రామ నివాసి సతీష్ చక్రవర్తి, ఉదయాస్తమానాలు మా మకాంకు వచ్చి వచ్చి మాక్షేమం విచా రిస్తూ, మాకు అవసరమైన వస్తువులు బజారు నుండి తెచ్చి పెడుతూ నాకు చాల దగ్గర బంధువైనాడు. 'పరి చయము లేని వానిని సోదరుని జేసి, దూరమును దగ్గరగ చేయు దొరవు నీవు' అన్నరవీంద్రుని పద్యాపాదాల వంటి వేవో జ్ఞాపకం వచ్చి మనసుకు ఊరట కలిగేది. బెయిసారీ బిడ్డ మా పట్ల చూపిన ప్రేమ, చేసిన సేవ మరపురాదు. నా క్లాసులోని సహా ధ్యాయుడే. కాని క్లాసులోని మిగతా విద్యార్థులెవరు గాని మా వద్దకు వచ్చి పోతూండిన జ్ఞాపకం లేదు. సెప్టెంబరు పరీక్షలు పూర్తయి, స్వస్థానాలకు వెళ్లిపోయిన పిదప కూడ ఆ చక్రవర్తికీ నాకూ మధ్య ఉత్తర ప్రత్యుత్తరాలు జరిగి, అతడు వ్రాసిన ఒక పోస్టుకార్డు నా వద్ద చాలా కాలం దాచిపెట్టుకొని, యితరులగూడ చూపిస్తుండే వాడను. చెరిగిపోని ఏ నాటి జ్ఞాపకాలో యివి!

పరీక్షలు జరుగుతున్న సమయం లోనే ఇండియా చరిత్రను మార్చి వేసిన సంఘటన జరిగింది.

(ఇంకా వుంది

# డైరీ

## అక్టోబరు 29, 1991

'గురు బ్రహ్మ గురుర్విష్ణుః గురుర్దేవో మహేశ్వరః - గురు సాక్షాత్పర బ్రహ్మ - తస్మై శ్రీ గురువే నమః' - అటువంటి గురువు 101 వ జన్మదినాన్ని చిల్డ్రన్స్ గార్డెన్ స్కూలులో, జివి సుబ్బారావు ట్రస్ట్ ఎంతో ఘనంగా ఉదాత్తంగా భక్తి ప్రపత్తులతో జరిపింది. స్వాగతం తెలిపిన ప్రిన్సిపాల్ శకుంతలా శర్మ, తను, మూడేళ్లపాటు బాలభారతి సుబ్బారావు గారి దగ్గిర చదువుకున్నానన్నారు. 91 ఏళ్ల యువకుడైన కెజె శర్మని ఈ సందర్భంగా గౌరవించారు - ఇంత కాలంగా 'జివియస్ ట్రస్ట్' ఆయన నిర్వహిస్తూ వచ్చారు - ఈ మధ్యనే సెక్రటరీ బాధ్యతను శకుంతలా శర్మకు వొప్పగించారు. గురువు గారి జ్ఞాపకాన్ని ఆయన విద్యార్థులలోను, అభిమానులలోను చైతన్యవంతంగా ఉంచాలని, ఈ ట్రస్ట్‌కి ఊపిరిపోసిన వారు స్వర్గీయ వియన్ శర్మ.... నైవెలిలోని ఉన్నతోద్యోగి నటరాజన్, ఈనాటి సభా కార్యక్రమంలో ఎంతో ఉత్సాహంగా పాల్గొన్నారు. రుషీవాలీలో ప్రిన్సిపాల్‌గా పనిచేసి ఎందరినో తీర్చిదిద్దిన పుణ్యమూర్తి, ధన్యజీవి 'జివియస్'. సంసార తాపత్రయంలో పడకుండా సద్విద్యా వ్యాప్తికి, విద్యా దానానికి జీవిత మంకితం చేసిన మహానుభావుడాయన. మాజీ రాష్ట్రపతి సంజీవరెడ్డి ఆయన శిష్యులు. 'జివియస్' సుశిక్షణ ఎందరో ప్రతిభావంతులని తయారు చేసింది .... "డాక్టర్ అనిబిసెంట్ పరిధిలోకి వచ్చిన వారందరూ ఒక విధంగా మార్గదర్శకులయారు. ఆమె తేజః ప్రభావం అటువంటిది. బెనారస్ లోను, మదనపల్లిలోను, అడయారులోను ఆమె చల్లిన వెన్నెల, ఆ చల్లటి కాంతులలోని విలక్షణత యిప్పటికీ మనకు స్పష్టంగా కనపిస్తోంది. విద్య కేవలం ఆధి భౌతికం కాకూడదు; అది ఆధ్యాత్మికతతో మిళితమైనప్పుడే రాణిస్తుంది, పరిమళిస్తుంది. ఎండిన రొట్టలాటి సమాచారంతో బుర్రలు నింపినంత మాత్రాన వివేకం కలగదు. అది స్వీయ ఆలోచనతో చిగురిస్తుంది. పిల్లలకి తమంత తాము ఆలోచించుకోగలగడం నేర్పినప్పుడే, మనసు వికసిస్తుంది. పుస్తకాలు కావాలి - కాని, వాటి మోత బరువుతో ఏమీ వొన

గూడదు. చుట్టూ వున్న ప్రకృతితో లీనం కాగలిగితేనే పిల్లలకి స్వంతంగా ఆలోచించడం చేతనవుతుంది. స్వంత ఆలోచనని అలవరుచుకోలేని చదువు నిరర్థకం.... పిల్లల్ని చైతన్యవంతులుగా చేయగలిగిన బాటలో నడిచిన "జివియస్" వంటి వారు చిరస్మరణీయులు" – అన్నారు ముఖ్య అతిథిగా విచ్చేసిన అహల్యాచారి (కృష్ణమూర్తి ఫౌండేషన్).... వినుకొండ నుంచి జివియస్ మేనల్లుడు బ్రహ్మానందం, ఆయన భార్య సుభద్ర ఈ ఫంక్షన్ కోసమని వచ్చారు. ఇంజనీరుగా రిటైరైన బ్రహ్మానందం కూడా రుషీవాలీ స్టూడెంటే! తన కొడుకు పెళ్లీ పిల్లలూ లేకుండా బ్రహ్మచారిగా వుండి పోయినందుకు, 'జివియస్' తల్లి, వినుకొండలో ఒక రామాలయం కట్టించారనీ, దానిని అవ్వగారి రామాలయం అంటారనీ భోజనాలవేళ చెప్పారు సుభద్రా బ్రహ్మానందం.... బాలభారతి సుబ్బారావు గారు (జివియస్) నాలుగైదు రోజులలో కన్నుమూస్తారనగా, మేమూ శర్మగారూ (ఫిల్బ్రిన్ గార్డెన్ స్కూల్) వెళ్లాము. ఏవేవో కబుర్లు చెప్పారు. గాని ఆయనలో ఏదో నిర్లిప్తత ప్రవేశించినట్లనిపించదు. పాతికేళ్ల పరిచయంలో అనేకసార్లు ఆయనని కలుసుకున్నాం. ఆయన వాక్పటిమ, మాట సొంపూ మాకు తెలుసు.... 'జివియస్' దృష్టి ఎంత నిశితమైనదో తెలిపేందుకు ఒక చిన్న ఉదంతం చెబుతాను.... 1965. ఆ మధ్యాహ్నం బాలభారతి సుబ్బారావు గారు, శర్మగారు మా యింట్లో లంచ్‌కి; వారితో బాటు డోరతి కింగ్ (ఆమ్‌స్టర్‌డామ్ నుంచి వచ్చిన సైకాలజీ ప్రొఫెసరు – చాలా అందమైన మనిషి). డైనింగ్ టేబుల్ వద్ద ఇండో – పాకిస్థాన్ యుద్ధానికి సంబంధించిన ప్రస్తావన వచ్చింది. అప్పటికి యుద్ధం ప్రారంభమై రెండు రోజులై ఉంటుంది. ఈ యుద్ధం ఎంత కాలం జరుగుతుందోనని, తను యిప్పట్లో యింక యూరప్ వెళ్లలేక పోతానేమోననీ డోరతీ కింగ్ వివర్ణురాలై, తింటున్నది మధ్యలో ఆపేసి, ఒక మూలకు వెళ్లి కూచుంది. ఆమె భయాందోళన మాకు కొద్దిగా అర్థమవుతోంది. అయిదేళ్ల పాటు రెండవ ప్రపంచ యుద్ధ బీభత్సం చూసిన యూరప్ నుంచి వచ్చిందామె .... సుబ్బారావు గారు చాలా నిదానంగా తన సహజమైన చిరునవ్వుతో చెప్పారు: "మీరనవసరంగా భయపడకండి – వచ్చే నెలలో మీరు మీ దేశం వెళ్లవచ్చు. నెలల కొద్దీ పొడిగిస్తూ యుద్ధం చేయగల శక్తి సామర్థ్యాలు యిక్కడ లేవు. ఇండియాలో గాని, పాకిస్తాన్‌లో గాని వున్న పెట్రోలు నిల్వలు పది పన్నెండు రోజుల యుద్ధానికి సరిపడతాయి – మూడోవారం వచ్చేసరికి యిద్దరూ తగ్గక తప్పదు. బయట నుంచి ఎవరూ పెట్రోలు పంపరు – రానివ్వరు".... డోరతికింగ్ కాస్త తెప్పరిల్లింది. కాని ఆమె భయం పూర్తిగా పోలేదు.... సుబ్బారావుగారితో ఎప్పుడు మాట్లాడినా, ఏవో కొత్త విషయాలు తెలుసుకుంటున్నట్లుగా

ఉండేది. తేజః ప్రభావమంటే అదేనేమో!

## నవంబరు 01, 1991

"ఒకప్పుడు భాషా ప్రయుక్త రాష్ట్రాలు దేశ పటిష్టతకు దోహద కారి కాగలవని అనుకున్నాం. అమర జీవి పొట్టి శ్రీరాములు ఆత్మార్పణ కారణంగా ఆంధ్రరాష్ట్రం ఏర్పడింది. ఆ తర్వాత మిగతా భాషారాష్ట్రాలు ఒకటొకటే ఏర్పడ్డాయి. అయితే, యివి సమగ్రతా సమైక్యతలకు సహాయ పడ్డాయా అనేది సంశయాస్పదమే! ప్రాంతీయతా ధోరణులు, సంకుచి తత్వాలు భారీగా పెంచాయి. 85 కోట్ల సువిశాల భారతావనిలో అనేక చిన్న రాష్ట్రాలు వున్నా ఫరవాలేదు; పాలనా సౌలభ్యానికి అనుకూలమైన పెద్దరాష్ట్రాలైనా ఫరవాలేదు. కాని, భాషాతత్వం జాతీయతకు, దేశీయతకు అవరోధం కాకూడదు. విచ్ఛిన్నకర శక్తులను అదుపులో పెట్టి, ఐక్యత వైపు పురోగమించాలి. మనమందరం భారతీయులం - ఆ తర్వాతనే మిగ తావి," అన్నారు కళావాచస్పతి జగ్గయ్య. పొట్టి శ్రీరాములు హాలులో, ఆంధ్ర రాష్ట్రావతర దినోత్సవ సందర్భంగా! జయదేవ్ 'తెలుగు తల్లి' స్తుతితో ప్రార్థన గీతాలు పాడగా, కార్యదర్శి వైయస్ శాస్త్రి ఆహూతులకు స్వాగతం తెలిపారు.... ఈనాటి కవితా గోష్ఠిలో ఆధునిక ప్రాచీన కవితలు మొత్తం పన్నెండు మంది చెప్పారు. జివియస్సార్ కృష్ణ మూర్తి కవులను సభకు పరిచయం చేశారు. పివియల్ నరసింహారావు, సాయి ప్రసాద్, పప్పు వేణుగోపాల రావు, కెవి రమణమ్మ, పియస్ గోపాలకృష్ణ, ఉపద్రష్ట సాయి, నాగ భూషణం, పైడిపాల, వివియస్పెస్ మూర్తి, మల్లిక్, జయంత్ శ్రీకాంత్, జగ్గయ్య.... కవితలన్నిటిలోకీ సభాధ్య క్షుని (జగ్గయ్య) కవితాగానం, ప్రాచీన వరవడిలో దైనప్పటికీ హృదయాన్ని స్పందింపజేసింది, రంజింప జేసింది, పరవసింపజేసింది. కొందరి కవితల్లో పదాల కూర్పూ, రవళి తప్పితే రసజ్ఞత లేదు. సాయిప్రసాద్, గోపాల కృష్ణమూర్తి, రమణమ్మ – ఈ ముగ్గురూ మాత్రం మనసుకి హత్తుకొనే టట్టు కవితాత్మను తమ కంఠంలో పలికారు.

## ..... 09

'నా పుట్టిన పండగ జరపడం తప్పనిసరైతే, దానిని బాలలదినంగా పరిగణించండి' - అన్నారు పండిట్ నెహ్రూ 1954 లో. అప్పట్నుంచీ మనకు నవంబరు 14 బాలల దినోత్స వం అయింది. ఈ సందర్భంగా ఆలిండియా రేడియో మద్రాసు కేంద్రం వారు నవంబరు పధ్నాలుగు వుదయం 9-45 నుంచి 11-45 దాకా ప్రసారమయే పిల్లల ప్రత్యేక కార్యక్రమాన్ని, యివ్వాళ మ్యూజిక్ అకాడమీలో ఆహ్వానితుల సమక్షాన, రికార్డు చేశారు. రికార్డ్ అయిన ప్రోగ్రామ్ మేమందరమూ మూడు

గంటలకు పైగా చూసి ఆనందించి నప్పటికీ ప్రసారంలో శ్రోతలు వినేది రెండు గంటల సేపు మాత్రమే. తమిళ, తెలుగు, కన్నడ, మళయాళ భాషలలో ఉంటుంది ఈ ప్రత్యేక కార్యక్రమం. చాచా నెహ్రూ చిరు నవ్వుల గులాబీలే చిన్నపాపలు. పది పదహారేళ్లలోపు బాలబాలికలు పాల్గొన్న ఈ ప్రోగ్రామ్‌లో ఒక అయిటమ్‌ని మించి మరొకటి వుంది. ఇది బావుంది అనుకుంటే, ఆ తర్వాతది యింకా బావుందనిపించేది. ఒక తల్లి పిల్లలం, ఒక గూటి గువ్వ లం, మనందరం భారతీయులం - అంటూ దేశ సమగ్రత, జాతీయ సమైక్యత లక్ష్యంగా, లేతమనసుల లోని నిష్కల్మష కళాస్పందనతో మొత్తం కార్యక్రమాన్ని ఎంతో రక్తి కట్టించారు. గణేశన్‌కి రాజరాజేంద్ర చోళని గురించి వచ్చిన స్వప్నం, దేవా లయ నృత్యం, ఇంగ్లీషులోని యాక్షన్ సాంగ్, కేరళీయుల కమనీయ నాట్య విశేషం, వివిధానేక బృందగాన నృత్యాలు, 'సోలో' పాడిన, భారతి, అంబిక వంటివారి కృతులు (అందులో ముఖ్యంగా సాకేత రామన్, బదరీ నారాయణ ఛైల్డ్ ప్రాడజీస్), నాలుగై దేళ్ల పాపల డాన్సు - యిలా మూడుం పావు గంటలు ప్రేక్షకులని మెప్పిం చారు భాగ్యోదయ రేఖలైన బాల బాలికలు.

. . . . . 10

"పిచ్చుక మీద బ్రహ్మాస్త్రంలా అర్భకుడైన కృష్ణ మీద 'ఆదిత్య - 369' వంటి భారీప్రయత్నం మోపాను. నిర్మాతగా యిది అతని రెండవ చిత్రం.... 'టైముమిషన్' ఆధారంగా హాలీవుడ్ చిత్రాలు చాలా వచ్చాయి. కాని, మేము తీసినది 'బాక్ టు ఫ్యూచర్'కి కాని, మరొక దానికి గాని ఎంత మాత్రం కాపీకాదు. కృష్ణ దేవరాయలు కాలంలోకి ప్రేక్షకులని పట్టుకువెళ్లి మెప్పించాము; అలాగే భవిష్యత్తులోకి కూడా! స్పేస్‌షిప్ భూకక్ష్య వెలుపలకి పోవాలనే విష యం మాకు తెలుసు - కాని, యిది జనరంజన దృష్టిలో పెట్టుకు అల్లిన కథ. సాంకేతిక నిపుణులు, సంగీతం ఈ చిత్ర విజయానికి ముఖ్యులు — కెమెరావర్క్ ఎంత అపూర్వమో మీరే చూశారు.... 'అతిథి దేవోభవ' మన సంప్రదాయం గనక, బొంబయి నుంచి వచ్చిన 'అమరీష్ పురి' మొదట మాట్లాడుతారు" - అన్నారు చిత్ర సమర్పకులు నేటి సభాధ్యక్షులు యస్పి బాలసుబ్రహ్మణ్యం పార్క్ షెరటాన్ లో జరిగిన శతదినోత్సవములో. డైర క్టరు సింగీతం శ్రీనివాసరావు వెనుకటి చిత్రంలో వర్క్ చేయలేకపోయిన కారణాన, 'ఆదిత్య - 369'లో యాక్ట్ చేయడానికి వెంటనే వొప్పేసుకున్నా నని అమిరేష్‌పురి, బొంబయి నుంచి ఫ్లయిట్‌లో వస్తున్నప్పుడు తనకీ యస్పికీ ఈ సబ్జక్ట్ విషయమైన ప్రస్తా వన రావడం గురించి దర్శకులు సింగీతం చెప్పారు.... ముఖ్య అతిథి: విజయశాంతి. కళాకారులకు సాంకేతిక నిపుణులకు, పంపిణీదారులకు జ్ఞాపి

కల బహుకరణ అయాక, హీరో బాల కృష్ణ ప్రసంగం.... 'దర్శకులు సింగీతం శ్రీనివాసరావు ఈ వినూత్న ప్రయత్నం చేశారు.... ఫోటోగ్రఫీ అద్భుతము, అద్వితీయమూను. విస్మయానందకర సన్నివేశాలతో మిమ్మల్ని ఆశ్చర్యచకితులు గావిస్తూ కుర్చీకి కట్టేస్తుంది'.... ('జగతి' - సెప్టెంబరు 91)

. . . . . 12

ఇవ్వాళ అమెరికన్ సెంటర్లో పొయిట్రీ రీడింగ్ - అక్షరాలా పద్య పఠనం కాదు, స్వీయ గేయ రచనలు చదవడం. ముప్ఫయ్యయిదేళ్ల క్రితం తన మొదటి కవితా సంపుటి 'బహిష్కృతులు - వివాహాలు' (Exiles and Marriages) వెలువరించిన డొనాల్డ్ హాల్ (Donald Hall) గ్రాండ్ ఫాదరూ, గ్రాండ్ మదరూ గురించిన చక్కటి కవిత చదివారు. ఇరవై మూడేళ్ల ప్రాయంలో తన కోసం ఈ మహా ప్రపంచం వేచి వున్నట్లనిపిస్తుందట - అరవై ఏళ్లొచ్చేసరికి అంతా జ్ఞాపకాల పుట్ట.... ఎజ్రా పౌండ్, డైలాన్ థామస్, టియస్ ఎలియట్, రాబర్ట్ ఫ్రాస్ట్‌ల వల్ల ప్రభావితమవడమే గాకుండా వారిని స్వయంగా తెలిసిన వ్యక్తి డొనాల్డ్ హాల్.... 'గదిలో నుంచి గదిలోకి' (From Room to Room) 'సంధ్యని రానియ్' Let Evening Come) వంటి కవితా సంపుటాలు వెలువరించిన జేన్ కెన్యాన్ (Jane Kenyon) 1986 లో చైనా, జపానులలో పర్యటించింది ; అయిదేళ్లపాటు 'గ్రీన్ హవుజ్' అనే సాహితీ పత్రికకు సంపాదకురాలు. 1863 నాటి 'అమెరికన్ అంతర్యుద్ధం', ఏకోదరులు ఒకరినొకరు పొడుచుకోవడంలా ఎలా పరిణమించినదీ హృదయ విదారకంగా చెబుతుందామె.... పేర్లు భిన్నంగా వున్నా వీరిద్దరూ దంపతులు. ఈ భార్యాభర్తలు న్యూ హాంప్‌షైర్‌లోని తమ వ్యవసాయ క్షేత్రంలో, ప్రకృతి సోయగాలకు చేరువగా నివశిస్తున్నారు.

దుర్గా అన్నపూర్ణ - సిహెచ్‌ఎస్ మాధవరావు (అమెరికన్ కాన్సలేట్) దంపతుల కుమారుడు చి॥ సత్యనారాయణరావుకి, విజయవాడ 'అలెంబిక్' మేనేజరు భాస్కరరావు కుమార్తె సౌ॥ శారదకు, గుంటూరు టిటిడి కళ్యాణమండపంలో, నవంబరు ఎనిమిది శుక్రవారం సాయిత్రం 6 గం॥ 54 ని॥ లకు వివాహం జరిగింది. ఇవ్వాళ మద్రాసులోని హొటల్ సవేరాలో వెడ్డింగ్ రిసెప్షన్. కాన్ఫరెన్స్ హాలులో పాదం పెట్టగానే 'మాలతిగారు రాలేదే మండీ' అని అడిగారు మాధవరావు దంపతులు. 'అనుకోని అతిథుల రాక వల్ల' - అని సంజాయిషీ చెప్పాను. నవదంపతుల పై శుభాక్షితలు చల్లి లోనికి వెళ్లి కూచున్నాను. రిసెప్షనూ, డిన్నరూ ఎంతో ప్రశాంతంగా, స్నేహపూరితంగా వున్నాయి.... నూతన వధూవరులకు మా శుభాకాంక్షలు.

## . . . . . 15

అనిబిసెంట్, జార్జి అరండేల్, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, జివి సుబ్బారావు, వంటి మహనీయుల వల్ల ప్రభావితులైన శర్మాజీ, ఆంధ్రపత్రి కాఫీసులో (తంబుచెట్టి వీధి) ప్రూఫులు దిద్ది, తను టీచ్ చేస్తున్న అడయారు స్కూలుకి రోజూ కాలినడకని వెళ్లేవారు. పరిస్థితులు కలిసొచ్చి, ఈయనకు, కొలచల సీతారామయ్యకు ఉన్నత విద్యకై విదేశాలకు వెళ్ల గల అవకాశం లభించింది. సీతారామయ్య మొదట అమెరికా వెళ్లి, ఆ పైన రష్యా చేరుకు, కెమికల్ ఇంజనీరై, రష్యన్ వనితను పెళ్లి చేసుకు, ఇద్దరు ఆడపిల్లలకు తండ్రి అయి, అనుపమ కీర్తి ప్రతి ష్టలు గడించి, రష్యన్ మట్టిలో కలిసి పోయారు. సంస్కృతం పట్ల అభిలాష గల శర్మాజీ, జర్మనీ వెళ్లి, హైడిల్ బర్గ్ యూనివర్సిటీలో అధ్యాపకులై, శాకుంతలమ్ సంస్కృతంలో చెబుతూ, ఎల్లెన్ అను విద్యార్థినిపట్ల ఆకర్షితు లయ్యారు ; ఆ యిరువురూ దంపతులై, యూరోప్‌లో రెండవ ప్రపంచ యుద్ధ మేఘాలు కమ్ముకుంటున్న కాలంలో ఇండియా వచ్చి, 'బాలోద్యాన వనం' - అదే చిల్డ్రన్స్ గార్డెన్ స్కూలు - ప్రారంభించారు. ముప్ఫయిల నాటి చిన్నమొక్క, ఈ నాడొక వటవృక్ష మయింది. క్షీరనీర న్యాయంగా బతి కిన ఆ దంపతులలోని ఎల్లెన్ శర్మ, భర్త అడుగుజాడలలో అంటారే, ఆ విధంగా జీవన రథం నడిపిన జర్మన్ మహిళ, ముగ్గురు పిల్లల తల్లి, భర్త కంటె ఆరేడేళ్లు ముందుగా దివ్యలోకాలకు వెళ్లిపోయింది. అయిదా రేళ్ల క్రితం కొడైలో సాయంత్రం నాలుగు గంటల వేళ కాసెట్‌లో భగ వన్నామ సంకీర్తన వింటూ యిహలోక యాత్ర చాలించారు శర్మాజీ. వేసకు వేలు హృదయ మందిరాలలో ఆ దంపతుల రూపం చెదరదు. జీవితాన్ని శోభాన్వితం చేయగల స్ఫూర్తినిచ్చిన ధన్యజీవులు వారు.... ఇవ్వాళ ఎల్లెన్ శర్మ జన్మదినం. ప్రతిఏటా ఈ జయం తిని ప్రార్థన గీతాలతో, భజన కీర్త నలతో శర్మా దంపతుల స్నేహబాంధ వులు పరస్పరం కలుసుకు, గౌరవ నివాళి సమర్పించే రీతిలో జరుపుతారు శకుంతలాశర్మ. నిలువెత్తు బొమ్మ లోని ఆ దంపతులని చూస్తూంటే, ఎన్నెన్నో స్మృతులు మనసుని ద్రవీ భూతం చేశాయి.

## . . . . . 17

ఆలిండియా స్మాల్ అండ్ మీడి యమ్ న్యూస్ పేపర్స్ ఫెడరేషన్ (అధ్యక్షులు ; హరిభజన్ సింగ్) వారి మద్రాసు శాఖ సమావేశంలో, చిన్న పత్రికల కష్ట నిష్ఠూరాల గురించి ప్రస్తావించారు.... ముఖ్యంగా గ్రంథా లయ శాఖ, రాష్ట్ర ప్రభుత్వమూ వీరికి చేయూత నివ్వవలసిన బాధ్యత ఎంతైనా వున్నదనీ, సన్నగా వినిపించే ఈ కంఠాలు ప్రజాస్వామిక లక్ష్యాన్ని బలపరుస్తాయనీ, భారీ పత్రికలతో బాటు వీటికీ యితోధిక స్థానం ఉన్న

వనీ ప్రాంతీయ అధ్యక్షులు కల్లైమణి, కార్యదర్శి గామదాస్ తమ ఉపన్యా సాలలో తెలిపారు.

"ఈ సినిమా ప్రపంచంలో ఒక ముద్దర పడితే దానినుంచి తప్పించు కోవటం కష్టం. నాకు కామెడీ చిత్రాల డైరక్టరుగా ముద్దర పడింది. ఏ ప్రొడ్యూసర్ వచ్చినా, నా నుంచి కామెడీ చిత్రమే కావాలంటారు. కథాబలమూ సెంటిమెంటూ గల చక్కటి చిత్రం తీసి మెప్పు పొందాలని వుంది — కాని, ఆ సమయం రావాలి; మిగతావి అను కూలించాలి.... ప్రాత్రికేయులు మొదటి నుంచీ నా పట్ల అభిమానం చూపిస్తు న్నారు - వారికి నా మనఃపూర్వక కృతజ్ఞత ... 'టీలూ కాఫీలూ సిగ రెట్లూ డ్రింకూ లేకుండా ఐడియాలు ఎలా వస్తాయి?' - అని కొందరు మిత్రులు ప్రశ్నిస్తూవుంటే, నాకు ఆశ్చ ర్యంగా ఉంటుంది. మా గురువుగారికి కూడా (దాసరి నారాయణరావు) అటు వంటి అలవాట్లేమీ లేవు. ఆయన ఎంత చక్కటి కళాఖండాలు నిర్మిం చారో మీకు తెలుసు. ఇన్‌స్పిరేషన్ వచ్చేందుకు, ఐడియాలు కలిగేందుకు, యిలాటివేమీ అక్కర్లేదు. నిరంతర పరిశీలన, నిర్విరామకృషి — ఈ రెండే దారి చూపుతాయి," - అన్నారు దర్శకులు రేలంగి నరసింహారావు, పామ్‌గ్రోవ్‌లో, తెలుగు ఫిలిమ్ జర్న లిస్టులు ఏర్పరిచిన పత్రికా సమావేశ సందర్భంగా. అసోసియేషన్ అధ్య క్షులు జగదీష్‌బాబు, ఉపాధ్యక్షులు శ్రీనివాస్, కార్యదర్శి జగన్, కోశాధి కారి రాజు యింకా యితరులు ప్రసం గించారు.

. . . . . 21

నాగ దేవతా రాధన మన మత సంస్కృతిలో ఒక భాగమవడం వల్ల పాముల మీద, పాముల గురించి, పాములతోను చిత్రాలు మన ప్రేక్ష కులని సులువుగా ఆకట్టుకుంటాయి. పాము పగబట్ట లేదనీ, పాముకి కళ్ళూ చెవులూ ఒకటే గనక, వింటున్న ప్పుడు చూడలేదనీ, చూస్తున్నప్పుడు వినలేదనీ, పాముల వాని నాగస్వరా నికి పాము తలవూపడంలోని పరమ రహస్యం అదేననీ, పాములు పాలు తాగవనీ, విషం కక్కని పాము అయి నప్పుడే పాము మంత్రం పనిచేస్తోం దనీ - యిలాటివి సామాన్య జనా వళికి చెప్పి ప్రయోజనం లేదు. తమ పాత నమ్మకాలు పట్టుకు వొదలరు . తేనాండళ్ ఫిలిమ్స్ వారి 'నాగమ్మ' లో ఒక వైపున ఆదిశక్తి, మరొక వైపున కంప్యూ టరూ వున్నాయి. గైడెడ్ మిస్సయిల్ లాటి వేగ (గరుత్మంతుడు), శివుని మెడ వొదిలి వచ్చిన సర్పాన్ని నానా హింసా పెడుతూండగా, పరాశక్తి అడ్డుపడుతుంది. 'దేవి శ్రీదేవి' లో చూపించిన అయిదు పాటలూ చక్కటి బాణీలలో విన సొంపుగా వున్నాయి. తిరుపతి, యాదగిరి గురించి మనోరమ చెప్పగా, మస్కరం తస్కరల పాట పాడుతారు చిత్ర, బాలు ... సర్ప రాజుతోబాటు యమున, సితార,

బేబీ విచిత్ర మున్నగువారున్నారు. కర్పూరపు ఆంజనేయులు మాటలు ; వేటూరి, విజయరత్నల పాటలు ; శంకర్‌గణేష్ సంగీతం ; దర్శకత్వం : రామనారాయణ ; నిర్మాత : యన్ రాధ. .. పి ఆర్ ఒ : రాజు.

. . . . . 22

గొల్లపూడి మారుతీరావు దంపతుల కుమారుడు చి॥ శ్రీనివాస్‌కి, ఇండియన్ బాంక్ రంగనాధన్ దంపతుల కుమార్తె సౌ॥ జయంతికి రాజేశ్వరీ కళ్యాణ మండపంలో సాయంత్రం తొమ్మిది గంటలకు ముహూర్తం. ముహూర్తానికి ముందే విందు భోజనాలు. తెలుగు సినీ జగతిలోని పెద్దలందరూ నూతన వధూవరులపై శుభాక్షితలు చల్లారు. నవ దంపతులకు మా శుభాకాంక్షలు.

. . . . . 23

ఎవరీ కెజె శర్మ ? స్కౌట్ మాస్టరు. ఎందరు స్కౌట్ మాస్టర్లు లేరు ? ఉన్నారు, నిజమే. కాని ఈ స్కౌట్ మాస్టరు రుషీవాలీలో జివి సుబ్బారావు వల్ల ప్రభావితుడైన ఆదర్శ వ్యక్తి. 'నాకు 91 ఏళ్లు వచ్చాయి. జివి సుబ్బారావు ట్రస్ట్ బాధ్యత, ఇది ఏర్పడటానికి మూల పురుషులెవరో (వియన్ శర్మ), వారి అమ్మాయికి (శకుంతలా శర్మ) వొప్పగించడం నా కర్తవ్యం' - అని అక్టోబరు 29వ తేదీ నాటి సమావేశంలో చెప్పిన కెజె శర్మ, వయసు పైబడ్డా పరిశుభ్రమైన ఆరోగ్యవంతునిగా కనిపించిన మనిషి, యింత సునాయాసంగా తన పని అయిపోయినట్లు వెళ్ళిపోతారని ఎవరనుకోగలరు ? సమస్తం కాలవాహినిలో అంతర్భూతం.

. . . . . 26

శరత్‌బాబు, రాధ ప్రధాన జంటగా, కొండముది శ్రీరామ చంద్రమూర్తి దర్శక రచయితగా, గీతాంజలీ క్రియేషన్స్ (హైదరాబాదు) వారి 'మంజీర నాదం' పాటలు చూపించారు 'దేవి – శ్రీదేవి'లో పాటలు సినారె, సిరివెన్నెల లవి ; పాడినవారు: బాలు, సుశీల, జేసుదాసు, నాగూర్ బాబు, చిత్ర, వాణీజయరామ్, శైలజ రంగనాథ్, సాక్షి రంగారావు, పద్మనాభం, వంకాయల, రావి కొండలరావు, ధమ్, కొల్లూరి, గాయత్రి, రాజేశ్వరి, వరలక్ష్మి, జయవాణి మున్నగు వారు.... నిర్మాత : బండి రామోహన రావు.... 'శివ పార్వతీ దివ్య కళ్యాణ గీతిక' (సినారె), 'పచ్చి యెడలిదాన' (క్షేత్రయ్య పదం), 'కలవారి కూతురు కలికి కామాక్షి' (సిరివెన్నెల) - ఈ మూడే కాదు, ప్రదర్శించిన ఏడు పాటలు రసగుళికలు. నాట్య కళా రీతులతో, గానా మృత ధారతో ప్రేక్షకులను మెప్పింప నున్న చిత్రమిది.

—యవ్వార్ చందూర్



సీరియల్

# మధు స్వప్న శాఖ

## పూజిత

గడిచిన కథ: సివిల్ ఇంజనీరు విశాలకు, డాక్టరు నాగార్జునకు వివాహం నిశ్చయమయింది. కాని, విశాలకు ప్రమాదం సంభవించడంతో వారి వివాహం వాయిదా పడుతుంది. నాగార్జున చెల్లెలు చందనకు ముహూర్తం పెడతారు. ఆ పెళ్లి పందిట్లో లావణ్య, నాగార్జునలో కృష్ణని చూస్తూ, స్పృహ కోల్పోయి, అతని కాళ్లకు చుట్టుకుంటుంది. లావణ్య ఒక న్యూరోటిక్ పేషంట్ - ఆమె పట్ల అందరికీ సానుభూతి.... (ఇక చదవండి

"ఎంతయినా త్యాగం చేస్తుంది పురుషుడి కోసం.... కాని, స్త్రీని ఒక విలాస వస్తువుగా, ఒక సెక్స్ సింబల్‌గా,.... ఒక ప్రేమ పాత్రగా... సుఖాల్ని అందించే ఒక మధు పాత్రగా .... వాడుకోవాలనుకుంటారు. నేనందుకు వ్యతిరేకిని.... మగవారికి గాని .... ఆడవారికి గాని ఒకే న్యాయం, ఒకే ధర్మం, ఒకే నీతి, ఒకే జీవితం.... అనేవాడ్ని నేను.... ఇప్పుడు చెప్పు విశాలా.... నీ తృప్తి కోసం, నీ సంతోషం కోసం.... నన్ను వేరే పెళ్ళి చేసుకొని,.... అలాంటి.... నీతి బాహ్యుల జాబితాలో చేరిపొమ్మంటావా....? ఎప్పటికి నీవే నా హృదయ రాణివని ఒక మనసున్న వ్యక్తిగా నిలచి పొమ్మంటావా ? చెప్పు, విశాలా .. ఈ పేద మనసులో మరొక వ్యక్తికి స్థానం లేదు...." ఆమె చేతిని తన చేతిలోకి తీసుకొని సుతారంగా నొక్కాడు.

తను వూహించని సత్యాన్ని, సాక్షాత్కరింప జేసి "ఇది న్యాయమా చెప్పు" ... అని అడుగుతుంటే, బదులు చెప్పలేక.... ఆ మహోన్నతుని ముందు, శిరసు వాల్చి కూర్చుంది విశాల.

ఉత్తముడిగానే అంచనా వేసుకుంది. కాని ఇంత లోకోత్త వ్యక్తిగా వూహించ లేకపోయింది. ఆమె ముఖంలో ఏవేవో భావాలు కదలిపోవటంతో మళ్ళీ అడిగాడు నాగార్జున.

"చెప్పు, విశాలా, సుఖ సంతోషాలంటే ఏమిటి, శారీరకంగా సుఖం పొంది, పిల్లల్ని కని పెంచటమేనా జీవిత సుఖం? దానికే అంత ప్రాధాన్యతా....? హృదయాల కలయికే జీవితం.... మనసూ.... మనసూ ఒకటై బతకటమే జీవితం.... ఎందరు స్త్రీ పురుషులు లేరు ....

మనసులు కలవక శారీరకంగా భార్యా భర్తలుగా పాశవిక జీవితం సాగించే వారు ? అది మనకొద్దు. నీకు నేను.... నాకు.... నీవు... తోడు నీడలం... ”

“బ్రతికినంత కాలం మీకు భారంగా మిగిలిపోవటం నాకు... ఎలా.... ఇష్టమవుతుంది చెప్పండి... ?”

“నీవు భారమని ఎవరు చెప్పారు ? ... నీవు నడవలేనంత మాత్రాన నాకు భారమని ఎలా ఊహించావు ? అసలు నీవిలాగే వుండిపోతావని ఎవరు చెప్పారు ? కొద్ది కాలంలో నీకు ఖచ్చితంగా బాగు అయిపోతుంది.... అందరిలాగే తిరగ్గలవు.”

“అచ్చం సైకియాట్రిస్ట్ ననిపించుకున్నారు” అంటూ నవ్వాలని ప్రయత్నం చేసింది విశాల.

“విశాలా... నా మనసు చెపుతోంది నీవు తప్పకుండా .... మామూలు మనిషిగా తిరగ్గలవు.... నాట్య మయూరిలా.... నాట్య చేయగలవు. నీవే మాత్రం డిజపాయింట్ కావొద్దు విశాలా.... నీతోనే నన్నుండి పోనీయ్....” లేచి ఆమె చెంపల్ని ప్రేమగా తన చేతులతో స్పృశించాడు. ఆ లాలనకు ఆమె గువ్వలా అతనిలో ఒదిగిపోయింది. ఆ ప్రేమికులను చూసిన నెలవంక.... వెండి మబ్బుల చాటున దాక్కుంది.

## 66

“ఆ అమ్మాయికి ఎలా వుంది ఫోన్ వేసి కనుక్కున్నావా ?”.... కొడుకుని అడిగింది రాజేశ్వరి.

“ఫోను చేయలేదు, మమ్మీ.... వెళ్ళి స్వయంగానే చూడాలి” అని చెప్పాడు నాగార్జున.

“ఎందుకలా కాళ్ళ పట్టుకు పడిపోయింది. ? చాలా మంచి అమ్మాయిలా వుంది లావణ్య. ఎందుకలా పడిపోయిందంటావ్.. .? నీ కాళ్ళ అంత గట్టిగా పట్టుకుని, విడిపించినా విడవకుండా పట్టుకుంది. ఆ అమ్మాయిని చూసేందుకు నేనూ వచ్చేదా....?”

“వద్దులే మమ్మీ - పెళ్ళి సందడి ఇంకా తగ్గలేదు. మరొకసారి ఎప్పుడైన తీసుకువెళ్తాను” అని చెప్పి నాగార్జున వెళ్ళిపోయాడు.

కొడుకు కాళ్ళ పట్టుకుని పడిపోయిన లావణ్య,.... మాటి మాటికి గుర్తు కొస్తోందామెకు. నాగార్జున్ని ప్రేమిస్తోందేమో ఆ అమ్మాయి ! ఒక వేళ అలా అయితే విశాలకు నచ్చచెప్పి వారిద్దరకూ వివాహం జరిపిస్తే...., ఇంతలో విశాల వీల్ చేర్‌లో అక్కడకు వచ్చింది.

“విశాలా.... టిఫిన్ తినమ్మా.... రా....” అని వీల్ చేర్ డైనింగ్ టేబిల్ దగ్గరగా తీసికెళ్ళింది రాజేశ్వరి. ఇంత ఆత్మీయత చూపెడుతున్న ఈ మనుషులకు తను.... ఆజన్మాంతరం కృతజ్ఞతగా వుండాలి - అని అనుకుంది విశాల.

## 67

నాగార్జున కారు డ్రైవ్ చేస్తూ లావణ్య గురించే ఆలోచిస్తున్నాడు.

ఏమిటామె ప్రవర్తన? తన మీద వ్యామోహమా? ఏమిటీ అపురూప కల్పన? ఆమెతో తన కలయిక ఏదో విచిత్రంగా వుంది.

లావణ్య ఇంటి ముందు కారాగింది. నౌకరు వడి వడిగా వెళ్ళి కారు డోర్ తెరిచాడు. నాగార్జున కోసమే ఎదురు చూస్తున్నట్టు శ్రీనివాసరావు ఎదురొచ్చాడు.

"గుడ్ మార్నింగ్, డాక్టర్....,"

"వెరి గుడ్ మార్నింగ్.... లావణ్య ఎలా వుంది....?"

"మీ కోసం మేడ మీద వెయిట్ చేస్తోంది – వెళ్ళండి"

నాగార్జున మేడ మీద కెళ్ళి, లావణ్య గది ముందు నిలుచున్నాడు. నిశ్శబ్దంగా వుంది. వుండి, వుండి.... వీణ మీద కొన గోటితో మీటుతున్నట్లుంది. ఆ శబ్ద లహరి కృష్ణా, కృష్ణా అని పిలుస్తున్నట్లుగా వుంది.

తలుపు మీద చిన్నగా శబ్దం చేసి "మే,... ఐ.... కమిన్...." అన్నాడు.

"రండి..." అంది లావణ్య విప్పారిన ముఖంతో. నాగార్జున లోపల కొచ్చి ఆమెను చూశాడు.

అప్పుడే తలార స్నానం చేసినట్లుంది. భారీ కురులు కాకపోయినా... ఒత్తయిన జుట్టు ఫ్యాన్ గాలికి రెప రెపలాడుతోంది. పసిమి ఛాయ గలిగిన ఆమెలో ఆకర్షణ అద్భుతమైనది. ఆ కనులెప్పుడూ అతన్ని తన్మయత్వంగా, గిలిగింతలు పెడుతూ, కౌగిలించుతున్నట్లే వుంటాయి. ఆమె పెదవులు మొలక నవ్వులతో మురిపిస్తుంటాయి. ఇంత ఆకర్షణీయమైన సౌందర్యకాంతులు ప్రలోభ పెడుతున్నా, తను డాక్టరుననే విషయం విస్మరించలేదు నాగార్జున.

ఆమె వ్యక్తిత్వం గొప్పదే; ఆమె చరిత్ర ఓవింత, ఆమె హృది ఓ రాగాలాపన; ఆమె మనసు ఒక ప్రేమ జ్యోతి. ఆమెను ఏవో ఇతిహాస జ్ఞాపకాలు తల్లడిల్ల చేస్తున్నవి. అవి చెపితే ఏమి జరుగునో... చెప్పకుంటే తనేమై పోవునో, అని సతమతమై పోతోంది లావణ్య.

ఒక సైకలాజిస్ట్‌గా అర్థం చేసుకోగలిగిన నాగార్జున, ఆమె చరిత్రకు.... తనకీ ఎదో సంబంధం వుందని, ఆ వింత కల్పనలో తను ఇరుక్కోకుండా తప్పించుకుంటూ, ఒక దారికి పట్టుకు రావాలి అనుకున్నాడు.

"కూర్చోండి...."

చెయిర్ ఒకటి ఆమెకి దగ్గరగా లాక్కొని కూర్చున్నాడు.

వీణను సవరిస్తూ, "సారీ.... డాక్టర్, నిన్న మీకేదో.... ట్రబుల్ ఇచ్చినానట.... ఐయామ్ వెరీసారీ," అంది.

"ఫర్ గెటిట్.... ఇప్పుడెలా వుంది....?"

"నాకేమయింది.... బాగానే వున్నానుగా....?"

"మరెందుకు, సారీ....?"

"నిన్నటి దానికి...."

"మీకు గుర్తుందా.... ప్లీజ్ కుశలీ.... మీ మనసాపమేమిటో నాకు చెప్పకూడదా... ?"

"ఏమని.... చెప్పమంటారు.... ? నిన్న పెళ్ళిపందిట్లో మీపాదాల చెంత పడిపోయానట... ఎంతకీ విడువ లేదట.... పెళ్ళిపందిట్లో కొంచెం అల జడి జరిగిందట... ఇదంతా నా మూలం గానేకదా అందుకే 'సారీ' చెప్పాను."

"అదే అలా ఎందుకు.... జరి గింది ...? మీ మీద మీకు కంట్రోల్ లేకుండా అలా ఎందుకు పడిపోయారో గుర్తుచేసుకోండి."

"నేనేమి యిప్పట్లో చెప్పలేను. నన్ను మీరా విషయం అడగవద్దు."

"మిమ్మల్ని అడక్క ఎవరిని అడ గాలి ? మీకు నేనంటే ఎంతో గౌర వము, అభిమానం...."

"అనురాగం కూడ" అంది లావణ్య....

"అయితే మనసు విప్పి ఎందుకు చెప్పరు...?"

"డాక్టర్... నేనంటే... మీకు నిజంగా ఇష్టమా ?" అని లావణ్య అడుగుతూంటే రోజారేకుల్లాంటి ఆమె అధరాలు... సన్నగా వణికాయి.

"మీకా సందేహమెందుకు... ?"

"చాలు, డాక్టర్.... ఈ జన్మకి అది చాలు... జీవితాంతం ఈ మధుర భావనతో బ్రతికేయగలను. రాధా కృష్ణులు ఎల్లప్పుడూ విడిగా వున్నా, వాళ్ళది అమర ప్రేమ. ఈ కుశలీ కృష్ణుల ప్రేమకూడ ఇలలో ఇతిహాసం గా నిలిచిపోతుంది" అంటున్న ఆమె కనుకొనల్లోంచి జారింది కన్నీటిచుక్క.

"మీరేదో దాస్తున్నారు... వివరం గా చెప్పు లావణ్యా"

"నేనూ చెప్పాలనే అనుకున్నాను. ఆ రోజు అంతా ఒక ప్లాన్ ప్రకారం వూహించుకుని ఎదురు చూశాను."

"ఏ రోజు...?"

"విశాలకు యాక్సిడెంట్ అయిన రోజు. కాని, ఇప్పుడు చెప్పకుండనే మంచిదనుకుంటున్నాను. ప్రస్తుతం ఏమీ చెప్పలేను." ఆమె ముఖాన నీలిమబ్బులు కమ్మాయి.

ఎందరో రోగులకు నయం చేసాడు .... 'సైకిక్'గా వాళ్ళు ఎంతో తల క్రిందులుగా చేసినా, హృదయాన్ని కదిలించలేదు. మరి లావణ్యతో ఏమిటీ అనుబంధం ? ఆమెను గుండెల దగ్గరగా చేర్చుకుని ఓదార్చాలనే బలీయమైన కోరిక ఎందువలన కలుగు తోంది...? లిప్తపాటు మాత్రం ఆ వాంఛ ఎందుకు కలగాలి... ?

"కుశలీ... నీవు టివిలో చూశావు కదా వసుదేవుడు దేవకీదేవితో ఏమి చెప్పాడు. 'రోనా... కిసిబాత్ కా ఉత్తర్ నహీ హై... అంటే ఏడుపు ఏ మాటకి జవాబు కాదు... నీవు ఏడుస్తే ఈ సమస్య తీరిపోదు కుశలీ .... నీ పేరు లావణ్య.... కుశలీ అని పిలువమనే నీ ఇష్టాన్ని నేను .... అంగీ కరించి అలా పిలుస్తున్నాను. ఈ కుశలి అనే పిలుపు వెనుక... ఏదో... బలీయమైన గతం దాగి వుందని నాకు తెలుసు..."

"మీకు తెలుసా..." చటుక్కన తలెత్తి అడిగింది.

"తెలుసు... "

"నన్ను చూస్తే మీకేమని పిస్తోంది....?"

అతను నిట్టూర్చి లేచి నిలుచుని.... దగ్గరలో వున్న కిటికి దగ్గరగా వెళ్ళాడు.... ఆ కిటికిలో నుండి క్రింద గార్డెన్ చక్కగా కనిపిస్తోంది. ఆ పచ్చని చెట్లు, పచ్చిక.... అందులో రంగు రంగుల పూలు... ఈ ప్రపంచమే ఒక రంగులమయం. అందులోని వింతల్ని చూస్తూ, ఆ ప్రశ్నకు ఏమి చెప్పాలా అన్నట్టు వెనక్కి తిరిగి నవ్వుతూ.... "కుశలీ... నీవెప్పుడూ కుశలంగా నవ్వుతూ హాయిగా ఆనందంగా వుండాలనిపిస్తుంది. నీవు... దుఃఖిస్తే నేను చూడలేను. ఎల్లవేళలా చలాకీగా వుంటే చూడాలనిపిస్తుంది." చెప్పాడు నాగార్జున.

"అవే మాటలు... అవే పలుకులు నేను భరించలేకున్నాను... ఈ విచిత్ర వ్యధ... ఈ డాక్టర్ నాగార్జునకు... అంతా గుర్తుందా...? గుర్తున్నా లేనట్లు నటిస్తున్నాడా విశాల కొరకు...?" ఆశ్చర్యంగా అతన్నే చూస్తోంది లావణ్య.

"వాట్ హాజ్ హపెండ్... కుశలీ... నేను చెప్పింది నీకు నచ్చలేదా...?"

"డాక్టర్... ఈ జ్ఞాపకాలు మీలో వుండి కూడా నన్ను ఎందుకిన్నాళ్ళు దూరంగా ఉంచారు? ఇక మీదట

## ముఖ చిత్రం



భారత రాజకీయాలలో బొంబయి నగరానిది గాంధీగారి కాలంనుంచీ ఒక ప్రత్యేకస్థానం. చైనాతో సరిహద్దు కలహం ఏర్పడి, రక్షణ మంత్రిగా కృష్ణమీనన్ రాజీనామా చేయవలసి వచ్చినప్పుడు, పండిట్ నెహ్రూ మహారాష్ట్ర ముఖ్యమంత్రి వైబి చవాన్‌ని, బొంబయి నుంచి ఢిల్లీకి రక్షణమంత్రిగా రప్పించుకున్నారు. అప్పట్లో చవాన్ తనకు నమ్మకస్తుడైన విపి నాయక్‌కి ముఖ్యమంత్రి పదవి వొప్పజెప్పి, స్వరాష్ట్రంలో తన స్థానబలిమి కాపాడుకున్నారు. చరిత్ర పునరావృతి మవడమనేది మన కళ్ల ముందు సంభవించింది. కాంగ్రెస్ పార్టీ తరఫున భారత ప్రధానిగా పివి నరసింహారావా, శరద్ పవారా అనే విషయమై ఆరు నెలల క్రితం పత్రికలు కాస్త ఊహాగానాలు చేశాయి. కేంద్రంలో, అనుభవజ్ఞులైన పివి, ప్రధాని అయారు; వెనకటి విపి నాయక్ 'కజిన్' సుధాకరరావు నాయక్‌కి, శరద్ పవార్ మహారాష్ట్ర ముఖ్యమంత్రిత్వం వొప్పగించి, తను రక్షణ మంత్రిగా ఢిల్లీ వచ్చారు. రాజకీయ చదరంగంలో ఆరితేరిన శరద్ పవార్ మన రక్షణశాఖ ఆధునీకరణకు అనేక విధాల తోడ్పడుతున్నారు.



ఒక్క క్షణం కూడ మిమ్మల్ని విడిచి వుండలేను.... నన్ను మీ చరణాల వద్ద రాలిపోనీయండి.... ఈ సృష్టిలో ప్రేమ ఎంతో మహత్తరమైనది. ఈ ప్రేమకు అంతముండదు. జన్మజన్మల కైనా.... ప్రేమకు చావులేదు. మీకు గుర్తురావటంతో నా జన్మతరించింది...." - అమితమైన ఆనందంతో ఆమె చెబుతూంటే.... ఆశ్చర్య పోవటం నాగార్జున వంతయింది.

తనకేమిటి, గుర్తు రావటం ఏమిటి ....? అగమ్య గోచరంగా వుంది. అంతా ఆమె తృప్తికోసం చెప్పిన మాట, అది ఆమెకు అంత ఆనందాన్ని కలిగించడం వింతగావుంది. ఈ పరిస్థితులలో తనేమి చేయాలీ....? బోధపడటంలేదు. ఆమె సంతోషాన్ని నేల రాసెయ్యాలా.... మౌనంగా అంగీకరించాలా....? సందిగ్ధావస్థలో ఆమె వైపు చూశాడు.

ఆనందంతో ఆమె కళ్ళు మెరిసి పోతున్నాయి.

అంతసేపూ నాగార్జున, లావణ్య క్రిందకు రాకుంటే, కూతురికి మళ్ళీ ఏమైందనే ఆందోళనతో, పైకి వచ్చిన శ్రీనివాసరావు, హాయిగా గాలి .... పీల్చుకున్నాడు - లావణ్య సంతోషంగా వుండటం చూసి !

## 68

విశాలకు కొత్త చీర, జాకెట్టు, పసుపు కుంకుమ వెయ్యిన్ని నూట పదహార్లు, వెండి పళ్ళెంలో పెట్టి అందించింది రాజేశ్వరి.

"ఎందుకివన్నీ, అంటీ....?"

"నా తృప్తి కోసం...." అంది రాజేశ్వరి.

"వద్దనకుండా తీసుకో" అంది చందన అల్లరిగా.

మెల్లగా కారులోకి ఎక్కించారు విశాలను వీల్‌చేర్‌తో

"చందూ.... పండ్లబుట్ట లోపలే పెట్టాను - కొంచెం తీసుకురామ్మా !" అంది రాజేశ్వరి.

చందన లోపలికెళ్ళి పళ్ళబుట్ట తెచ్చింది.

విశాల వూపిరి బిగబట్టి మౌనంగా వుండిపోయింది.

చందన కారెక్కి, విశాల ప్రక్కన కూర్చుంది. కారు కదిలింది.

సాయింకాలం ఇంటికి చేరుకున్న నాగార్జునకు విశాల కనిపించలేదు. "చందూ, విశాల ఎక్కడ....?"

"అది ఒక పేదరాసి పెద్దమ్మ.... ఎంత చెప్పినా వినలేదు.... అక్కడ కొత్త స్కూలట.... శమ్మి.... విమ్మి ఎలా చూచుకుంటారో.... అనీ వెళ్ళిపోయింది...."

చందన తేలిగ్గా చెబుతున్నా.... నాగార్జున వూహించాడు, ఏదో జరిగి వుంటుందని ! కాని ఈ ఇంట్లో ఆమెను బాధపెట్టే వాళ్ళు ఎవరూ లేరే ! తనతో కూడ చెప్పకుండా

వెళ్ళి పోయిందంటే, ఎదో కారణం వుండాలనుకొని విశాల దగ్గరకు బయలుదేరాడు.

"భోజనం అయినా చేయకుండా ఎక్కడికి....?" రాజేశ్వరి అడిగింది. "త్వరగా వచ్చేస్తాను మమ్మీ!" అని వెళ్ళిపోయేడు నాగార్జున.

సూర్యారావు, ప్రమీల వరండా లోనే కూర్చుని వున్నారు, అతన్ని ఆదరంగా ఆహ్వానించారు.

సూర్యారావు ఆరోగ్య విషయం అవి, ఇవి మాట్లాడి, "ఆంటీ, విశాల ఎక్కడ?" అనడిగాడు.

"లోపల తన రూమ్‌లో వుంది"

విశాల గదికి వెళ్ళాడు.

మోచేతిని నుదిటమీద పెట్టుకొని, వీల్‌చేర్‌లో వెనక్కు వాలి కళ్ళు మూసుకునివుంది.

"విశాలా...." ఆ పిలుపు విని చేతిని క్రిందకు దించి సర్దుకుని కూర్చుంది.

"విశాలా ఎందుకని సడన్‌గా వచ్చేశావు... నాతో అయినా చెప్పకుండా"

"ఏమిలేదు... స్కూలూ ... అదీ" అంది ముక్తసరిగా.

"చెప్పాలంటే.... ఎన్నో కారణాలు.... అసలైనది.... ఏమిటి....?"

"నాగార్జున గారూ, ఇప్పటికే మా కుటుంబం అల్లరి పాలైంది. మేము ముగ్గురం ఆడపిల్లలం.... మోడు బారిన చెల్లెళ్ళు.... అంగవైకల్యం

గలిగిన నేను.... గుండెజబ్బుతో నాన్నగారు; అమాయకురాలైన అమ్మ. మా అందరి క్షేమంకోరి చెపుతున్నాను. దయచూపి నన్ను కనికరించండి... అవసరమనేది కలిగితే, నిస్సంకోచంగా నేనే కబురు పంపిస్తాను. మీ మనసు నాకు తెలుసు — అన్యథా భావించండి" అంది విశాల కూడ దీసుకున్న నిక్కచ్చితనంతో.

"విశాలా"... అన్నాడు తనరాక ఆ ఇంటికి మేలుకాదని ధ్వనింప జేస్తోందా? కాళ్ళక్రింద భూమి కదలినట్లుయింది.

"విశాలా, ఎందుకీ శిక్ష? నేను రావటం మీ కుటుంబానికి హాని కలిగిస్తుందా? ఆ మాట నీవు మనస్ఫూర్తిగా అంటున్నావని నేను ఎలా నమ్మగలను? ఒక్క రోజులో ఇంత మార్పు ఎలా వచ్చింది? ఏం జరిగింది? నీవు నాకు చెప్పదలచుకోలేదు... నన్ను దూరంగా ఉండిపొమ్మంటున్నావని గ్రహించగలను. విశాలా, నీవంటి అమృత హృదయిని చేయదగిన పనా ఇది...? నన్ను పరీక్షిస్తున్నావా... విశాలా... నన్ను దూరంగా వుంచాలని ఎందుకు చూస్తున్నావు...?" - వీల్‌చేర్‌ని అటు తిప్పుకున్న విశాల కళ్ళల్లో అశ్రుధార అధికమౌతోంది. కాని ఆమె ఆ దుఃఖంతో అతని కంటపడ తలచుకోలేదు.

"మీ మనసు నొప్పిస్తే, సారీ" అనేసి, మాటలు దింగమింగి రెండు చేతులు ముఖంమీద వుంచుకొని భోరున ఏడ్చింది. - మీరీ ప్రాంతానికి వెళ్ళి రండి" - అని నమస్కారం చేస్తూ!

## 69

ఇంటికెళ్ళిన నాగార్జున ఆలోచనలకు అంతులేదు. 'విశాల .. విశాల...' కనులు మూసినా, తెరచినా ఆమె రూపమే... తన మనసెరిగిన విశాల, తనకు భార్య కాబోయే విశాల, ఎందుకింత మాటలంది? దీనికి కారణం ఎవరు? విశాల మీద కోపం రాలేదు కాని, తన మనసు విరచిన వాళ్ళ మాటలు నమ్మి, నన్ను దూరం చేసుకుంటుందా? - అనిపించింది. ఎంతకీ ఆమె గురించిన ఆలోచనలే... విశాల దూరం అవాలని ప్రయత్నిస్తోంది. లావణ్య చేరువ కావాలని ప్రయత్నిస్తూంది. ఏమిటీ అనూహ్య పరిస్థితి? టాబ్లెట్ వేసుకు పడుకోవాలనుకుంటూండగా ఫోన్ మ్రోగింది.

"హలో డాక్టర్..."

అతని ఆలోచనలకి అనకట్ట వేసినట్లు గలగల మాట్లాడేస్తూంది లావణ్య. "నేను బాగా ఆలోచించుకున్నాను. మీకు అన్ని వివరంగా చెప్పి... ఈ హృదయ భారాన్ని తొలగించుకోవాలని, అంతా విని తరువాత మీ అభిప్రాయం చెపుదురు గాని! ట్రాజడీ అయినా... కామెడీ అయినా... ఈ అంతరంగ మథనం నుంచి విముక్తురాలనవుతాను. ఏమిటీ ఈ రోజు ఏదో ముభావంగా అనిపిస్తు

న్నారు. నేనే మాట్లాడుతున్నా.... మీరు మౌనంగా వున్నారు.''

"ఏమి లేదు, రేపు వస్తాను... అలాగే వివరంగా చెప్పండి'' అన్నాడు నాగార్జున.

❀ ❀ ❀

లావణ్యా చక్కగా ముస్తాబై డాక్టర్ నాగార్జున కోసం ఎదురు చూస్తూ కూర్చుంది. ఆమె కళ్ళల్లో కొత్త వెలుగులు. లేతాకుపచ్చ చూడీదార్ ధరించింది. ఆ డ్రస్‌లో అప్పుడే విక సించిన పూబాలలా ఉంది. అధరాలు నవ్వుల పువ్వులు కురిపిస్తున్నాయి. ఆమె కెందుకో గట్టి నమ్మకం తన చరిత్ర విని, తనని స్వీకరిస్తాడని!

నాగార్జున వచ్చాడు. ఎదురు వెళ్ళి అతనికి అతి చేరువగా నిలబడింది. అతను ఏ మాత్రం సహకరించినా అతని బుజాల చుట్టూ చేతులు చుట్టేసి వుండేది. ఆమె ఎద అతనికి అరంగు ళం దూరంలో మాత్రమే ఉంది. కవ్వింపుగా వున్న ఆమెను చూస్తుంటే, తియ్యటి వూహ మదిలో జొరబడి, గిలిగింతలు పెట్టేందుకు అవకాశం ఉంది. కాని మనిషికి నిగ్రహం ఎంతో గొప్పది అందుకే అతను దూరంగా జరిగి "ఈ రోజు చాలా హేపీగా కని పిస్తున్నారు'' అన్నాడు, తన భావాన్ని దాచిపెట్టి ఉల్లాసం కనబరుస్తూ!

"అవును డాక్టర్... జీవితపు పునా దికి తొలిమెట్టు'' అంది.

ఇద్దరూ కూర్చున్నారు. వాళ్ళిద్దరి మధ్య టీపాయ్ ఉంది. దాని మీద వాజ్. అందులో తాజాదనం విరిసే రంగు రంగుల గులాబీలు... వాటి మధ్య రెండే రెండు పసుపు రంగు అరవిరసిన గులాబీ మొగ్గలు ప్రత్యే కంగా కనిపిస్తున్నాయి, వారిరివురికి స్వాగతం పలికే ప్రతినిధుల్లా. పలక రింపుగా నవ్వుతున్నాయి ఆ గులాబీ మొగ్గలు.

"డాక్టర్... ఈ వేళ మీరేదో ముభావంగా ఉన్నారు.''

"అదేమీ లేదు... వర్క్ లోడ్."

"నన్ను చెప్పమంటారా... నేను చెప్పింది విశ్వసిస్తారా? కొన్ని ఇతి హాసాలు నమ్మలేనంత విడ్డూరంగా ఉండవచ్చు కాని, అవి కఠోర సత్యాలు కూడా కావచ్చు.''

"కుశలీ, మీరు చెప్పేది విశ్వసిం చేందుకే నేను మీ ఎరుట కూర్చున్నది. ఎలాంటి సంశయం లేకుండ మన సులో ఉన్నది చెప్పండి.'' - అన్నాడు. ఆమెను ప్రోత్సహిస్తూ.

నిటారుగా కూర్చుని అటు ఇటూ చూచి తన అరచేతులతో చెంపల్ని ఒత్తుకుంది. చెప్పబోయె సంగతి ఆమె తనువుని, మనసుని పులకింప చేస్తోంది. ఆమెనే పరీక్షగా చూస్తున్నాడు నాగా ర్జున.

ఆమె కళ్ళల్లో దైన్యత చోటు చేసు కుంది. ఆమె మనసు జ్ఞాపకాల పరిధి నుండి ఒడ్డుకు చేరినట్టు సేదతీరి... "డాక్టర్'' అంది.

ఏమి చెబుతుందా అని అతను ఎదురు చూస్తున్నాడు.

"పునర్జన్మ.... అంటే మీకు నమ్మకముందా ?"

"మీ విషయంలో.... నేనూహించింది ఇదే కాబట్టి నమ్మకం, అపనమ్మకం కాదు ముఖ్యం. మన కళ్ళెదుట వున్న వాటిని చూసి.... నిర్ణయాలు తీసుకుని జీవితంలో జొరబడే ముళ్ళను తొలగించుకోవాలి నేను నమ్ముతానా.... కాదా, అని కాదు మీరు యోచించవలసింది! మీ అనుభవాన్ని ఋజువు చేసుకోవటమే నాకు కావలసింది. అందుకని ఒకరి నమ్మకాలు, అపనమ్మకాలతో పనిలేదు.... మీకు గుర్తున్నది.... అంతా పూర్తిగా నిస్సంకోచంగా చెప్పటమే మీ కర్తవ్యం.... ఫలితం తరువాత. మన పని మనం నెరవేర్చాలి.... నీవు చెపుతానన్నది చెప్పు, కుశలీ...."

తనని తాను మరచి తన్మయత్వంతో చెప్పసాగింది లావణ్య. ఆమె చెప్పే ప్రతిమాట, ప్రతివాక్యం .... ప్రతిసంఘటన... ఆసక్తిగా వింటున్నాడు నాగార్జున.

అంతా వివరించి చెపుతున్న ఆమె కళ్ళనుండి కన్నీళ్ళు కారి... చెంపల మీద చారికలు కట్టాయి. కథంతా ముగిశాక... చటుక్కున నేలమీద ఆసీనురాలై... అతని మోకాళ్ళపై తన ముంజేతులాన్చి... తలెత్తి అతనికళ్ళలోకి చూస్తూ... "ఇంత వినినా,... ఏమీ గుర్తురాలేదా కృష్ణా ?" - అనడిగింది లావణ్య.

అతను గంభీర వదనంతో నవ్వి ... "ఇది ఈ జన్మలో జరిగినది... కాదు... నీకు గుర్తు వచ్చింటంటే అది నీ సుకృతం... కాని అందరికి సుకృతం వుండొద్దూ !"

"ఈరోజు నాహృదిలో వున్న భారాన్ని మీకు చెప్పుతున్నాను... మీరు ఏ రీతిగా దీన్ని తీర్చిదిద్దుకుంటారో ... మీ యిష్టం. ఇది వరమో శాపమో నాకు తెలియదు" అంది సజల నేత్రియై.

"జీవిత మెప్పుడూ శాపం కాదు... ఒకటి దొరకనప్పుడు... మరెన్నో వుంటాయి... దొరకని దానినే వెదుక్కోవటం తెలివి హీనత... ఈ ప్రపంచంలో చేయవలసిందీ... సాధించవలసిందీ ఒకే ఒకటిగా మిగిలిపోకూడదు. ఏ దారిన పోయినా [illegible]... కొన్ని సమస్యలు తప్పవు. ప్రతి సమస్యకూ పరిష్కారమార్గాన్ని వెతకాలి ... అలా చేసినప్పుడే... [illegible] మార్గం... తెలుస్తుంది. [illegible] మనిషిగా అయినా, ఆ మనిషి సాధించవలసింది... ఎంతోవుంది ఈ ధరణిలో ...కాని అందరిలాగే పెళ్ళి... పిల్లలు ...ప్రేమ... తినటం... నిద్రపోవటం ...ఇవేకాదు... మనిషిగా పుట్టినందుకు సార్థకత ఏర్పడాలి... అందరికీ కాకపోయినా, కొందరికైనా వుపయోగపడేలా జీవితాన్ని సాగించుకోవాలి. అనుకోవటంలోనే సార్థకత వ్యక్తమవుతుంది. ఈ జీవితాన్ని ఒక వరంగా భావించి కష్టసుఖాలు కావడికుండలు అనే ఇంగితంతో అసంతృప్తి లేకుండా బతకాలి... ఈ గాలి వెలుతురు, ఈ నీళ్ళు నిప్పు, పచ్చని చెట్లు

చేమలూ సమస్త ప్రకృతికీ కృతజ్ఞతా బద్ధంగా జీవించ గలగాలి... నీవు చెప్పిన ఆవూరిని అక్కడి ప్రజలను నాకు చూడాలని వుంది. తప్పకుండా అక్కడికి వెళదాం" అన్నాడు నాగార్జున ఆమెకు వూరట కలిగించేందుకు.

లావణ్య సంతోషానికి హద్దులు లేవు... వెనుకటి కృష్ణ ఈ జన్మలో నాగార్జున అయాడని ఆమె దృఢ పరచుకుంది.

## 70

విశాలని చూచేందుకు ఒక పెద్ద డాక్టర్ని అరేంజి చేశాడు నాగార్జున. తల్లితో చెప్పాడు - లావణ్యతో వాళ్ళ ఊరు వెళ్ళిరావలసి వుంటుందని. కాని, పునర్జన్మ విషయం మాత్రం ఏమి చెప్పలేదు.

తన కొడుకు లావణ్యతో వెళుతున్నందుకు ఆమె చాలా సంతోషించింది. వాళ్ళిద్దరూ అలా కలిస్తే పెళ్ళి సమస్య ఈజీగా తీరిపోతుందనేంత వరకే ఆమె ఆలోచన. కొడుక్కి పెళ్ళి చేయాలంటే పిల్లలు దొరక్క కాదు - అతను ఆమోదించాలి. విశాలను మరిపించే యువతి అతనికి తారస పడాలి.

శ్రీనివాసరావుతో చెప్పాడు.... "హాస్పటల్‌కి తీసుకుపోకుండా ఆమె ద్వారే చెప్పించ గలిగాను. ఇక ఏమీ ప్రశ్నలేదు. ఆమె హెల్త్ బాగుంది. లావణ్యను గురించి మీరు వర్రీ కావద్దు. మేము ఊరు వెళ్ళి వచ్చాక అన్నీ సర్దుకుపోతాయి. మీ అమ్మాయిని నేను కంటికి రెప్పల చూసుకుంటాను."

పరాయి పురుషునితో తన కూతురు ఒంటరిగా వెళ్తోందనే ఆలోచన కూడా రాలేదు శ్రీనివాసరావుకి.

✠ ✠ ✠

తారు రోడ్డు మీద సాఫీగా పోతూంది కారు. నాగార్జున పక్కనే ఫ్రంట్ సీటులో ఆసీనురాలైంది లావణ్య. ఆమె ముఖకవళికలు... క్షణ క్షణానికి మారుతున్నాయని గ్రహించిన డాక్టరు నాగార్జున, తన ఎమర్జన్సీ కిట్ మరొకసారి చూసుకున్నాడు.

తారు రోడ్డు ముగిసి పోయింది. ఆ గ్రామానికి గుర్తింపుగా ఒక చిన్న రోడ్డు కనబడింది. అక్కడ నుండి మట్టి రోడ్డు.

"ఆఁ.... ఇదే ఊరు ఇలా పోనీయండి" — చెప్పింది లావణ్య.

"కుశలీ.... ఈ రోడ్డు మీద కారు పోగలదా.... ?" - సందేహంగా అడిగాడు నాగార్జున.

"పాతికేళ్ళ క్రితం వున్న ఈ రోడ్డు ఇలాగే వుంది. కాకుంటే అప్పుడు నేలమట్టంగా వుండేది.... ఇప్పుడు కాస్త మట్టి పోగయినట్టుంది .... నెమ్మదిగా పోతుంది. కిందా ... మీదా పడి..." అంది పరిహాసంగా నవ్వుతూ.

"లావణ్యా... ఇదే వూరు కదూ !" అనుమానంగా అడిగాడు నాగార్జున.

"మీరు పూర్తిగా నన్ను 'నమ్మడం లేదు..." అంది లావణ్య మూతి ముడుచుకుంటూ.

"నిన్ను నమ్మక కాదు - ఈ గతుకులకు భయపడి! ఇంకెంత దూరం వుంది ?"

ఆమె కారు విండోలోంచి వెనుక్కి తిరిగి చూసింది. "మనం ఒక ఫర్లాంగు మాత్రమే వచ్చాము. ఒక మైలులోపు వుండవచ్చు. స్లోగా వెళ్ళండి" అంది.

కొద్ది దూరం వెళ్లాక ఒక మనిషి అలా పోతుంటే, పిలిచాడు నాగార్జున.

"ఏంటి బాబు" - ఒక్క అంగలో అక్కడకు చేరుకున్న ఆ మనిషి, గుడ్లు వెళ్లబెట్టి, కారులోకి చూసి అంతే, మరుక్షణమే... పరుగు లంకించుకున్నాడు. నలుభైఅయిదేళ్ల మనిషి - చిన్నపిల్లాడేమీ కాదు... ఎందుకు అలా పరుగు లంకించుకున్నాడో అర్థంకాక అయోమయంగా చూస్తున్నాడు డాక్టరు నాగార్జున. లావణ్య పడి పడి, నవ్వ సాగింది.

"ఏమిటి... ఎందుకు ఆ నవ్వు... వాడెందుకు అలా పరుగెత్తాడు ?" అనడిగాడు.

"మీకు అర్థం కాలేదా..."

కాలేదన్నాడు.

"మనల్ని చూచి దెయ్యాల మనుకుని పరుగెడుతున్నాడు."

"అంటే ?"

"మీకింకా తెలియదు కదూ. వాడు మీ పాలేరు..."

అంత తేలిగ్గా చెప్ప గలుగుతున్న ఆమెను చూసి, చేతులు గాలిలోకి తిప్పి... నవ్వేసి, కారు స్టార్ట్ చేశాడు.

"ఈసారి ఎవరినీ అడక్కండి. నేను చెప్పినట్టె పోనీయండి మనం తిరిగొచ్చిన దెయ్యాల మనుకుని రాళ్ళు రువ్వినా రువ్వచ్చు. ఇక్కడి వాళ్ళు. శుద్ధ మొద్దు ప్రజ... ఈ పలెటూరిలో అప్పటికి ఇప్పటికి ఏ మాత్రం మార్పు రాలేదని ఈ గతుకుల రోడ్డే చెపుతోంది" - అంది ఆగతుకులకి అతని మీద పడుతూ....

ఆ ఊరి విషయాలూ... ఆదారి... అన్ని చెపుతూంటే నాగార్జున వింటూ, కారు నెమ్మదిగా పోనిస్తున్నాడు.

మెట్ట పల్లాలలో కారు కుదుపులతో పోతూవుంది. ఇద్దరు ముగ్గురు కనబడినా వాళ్ళని అడగలేదు నాగార్జున. వాళ్ళు అల్లంత దూరాన్నుంచే ఈ కారుని వింత జంతువులా చూస్తున్నారు.

ఎలాగో పొలిమేరలు దాటి ఊరులోకి చేరుకున్నారు. పిల్లలు ఆడుకుంటున్నారు. అందరూ పది పన్నెండు వయసులో వాళ్ల నడిగాడు నాగార్జున. ఊరు పేరేమిటని... వాళ్ళు చెప్పారు.

"మనం వున్నప్పుడు వాళ్ళు పుట్టి వుండరు... అందుకే వాళ్ళు పారిపోకుండా చెప్పారు" అంది లావణ్య నవ్వాపుకుంటూ.

(ఇంకా వుంది

